# భగవద్గీతా పరిచయము




ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.



శ్రీమద్

# భగవద్గీతా పరిచయం

సంకలనం : బాలగంగాధర పట్నాయక్.


కృతజ్ఞతలు :

ఈ పుస్తక ప్రచురణకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ఆధ్యాత్మిక గ్రంధ ప్రచురణ సహాయ పధకం క్రింద 7 5 % ఆర్థిక సహాయం మంజూరు చేసిన T. T. D కార్యనిర్వహణాధికారి గారికి, సంబంధిత అధికార వర్గము వారికి, మా హృదయ పూర్వక కృతజ్ఞతలు


ప్రాప్తిస్థానము :-

1. శ్రీ శాంతి ఆశ్రమం.

   P. O. SHANTI ASHRAM.

   East Godavari District, AP.
   533 446

2. Sri Bala Gangadhar Patnaik
   C/o. Sri Ashok K. Patnaik
   III-6, NTPC Temp, Township
   P. O. DEEP SHIKHA
   Dist. Angul - Orissa
   759 147

# శ్రీమద్ భగవద్గీతా పరిచయం

## ముందుమాట.

''భగవద్గీత చదవడమే! అయ్య బాబోయ్! నాతరం కాదండోయ్! అయినా ఇప్పటి నుండీ ఇవిఅన్నీ మనకెందుకు? ముసిలయితే, చూచుకోవచ్చు.'' అని అనుకొనే ఆధునికులు అనేకులున్నారు. ఈ ధోరణి, ముఖ్యంగా, ఇంగ్లీషు చదువుల ప్రభావం లోనున్న వారిలో బాగా కనిపిస్తుంది.

సుమారు 6, 7, దశాబ్దాలుగా, స్వామీ చిన్మయానంద లాంటి మహాత్ములు చేస్తుండే నిర్విరామ కృషి ఫలితంగా సనాత ధర్మ పునరుద్ధరణ కార్యాలు కొంత ఊపు అందుకొన్నా, వాటిప్రభావము ఎక్కువగా మేధావి వర్గాల వారికే పరిమితమై, క్రింది స్తరాలకు అంతగా దిగి వచ్చినట్టు కనబడదు. భగవద్గీతపై ఆదిశంకరుల నుండి, అధునికుల వరకూ, అనేకులైన మహనీయులు భాష్యగ్రంధాలు రచించినా, గీతలోని నిగూఢమైన వేదాంత విషయాలు సామాన్యుల అవగాహనకు అందుబాటులో లేని కారణాన, గీత ఒక గగన కుసుమం గాను, పట్టు గుడ్డలో చుట్టబడి, పూజగదిలో నుంచ బడే ఒక పవిత్ర గ్రంధంగానే, నిలిచిపోయింది. అందుచేత, గీతాధ్యయనం పట్ల సామాన్య చదువరులలో ఆసక్తిని, కలిగించే సంకల్పంతోనూ, మహోన్నతమైన గీతా సౌధ సింహద్వారానికి, ఈ పరిచయ పుస్తకం ఒక నిచ్చెనగా ఉపయోగ పడగలదనే ఆశతోనూ, నాకు ఏవిధమైన యోగ్యతలూ లేకపోయినా, ఈ సాహస కృత్యం చేయడమైనది. గీతతో ఎలాంటి పరిచయమూ లేనివారిలో, ఈ పుస్తకం, ''గీతలో నేమి ఉందో తెలుసుకుందాం'' అనే ఉత్సుకతను కలిగించగలిగితే, ఈ ప్రయత్నం యొక్క ప్రయోజనం సిద్ధించినట్లే భావించ వచ్చును. ఈ క్రింది గ్రంధాలనుండి విషయ సంగ్రహం చేయబడింది.

1. Sreemad Bhagavadgita - by H H Swami Chinmayananda.

2. The Bhagavadgita - by H H Swami Sivananda.

3. గీతారహస్యము - లోకమాన్య బాలగంగాధర తిలక్.

4. గీతా మకరందము - స్వామీ విద్యాప్రకాశానంద గిరి వారు.

5. బ్రహ్మ సూత్ర దర్శనము - బ్రహ్మశ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు గారు.

6. బ్రహ్మజిజ్ఞాస(2వభాగము) - బ్రహ్మశ్రీమర్రిబోయిన రామసుబ్బయ్యగారు.

''శ్రీ భగవానువాచ'' అనే పేరుతో, గీతలోని కొన్ని ఆణిముత్యాల నెన్నుకొని, ఆధునికులకు సులభ గ్రాహ్యమైన రీతిలో ఈ పుస్తకానికి రెండవ భాగము, 340 పేజీల వ్రాతప్రతి తయారయినది. ఆ భగవానుని అనుగ్రహం ఉండి, ధార్మిక ప్రచురణకర్త లెవరైనా చేయూత నిచ్చి, పూనుకుంటే, ఆ గ్రంథం ప్రకాశం పొందవచ్చునని ఆశిస్తున్నాను.

భాషలోనూ భావప్రకాశంలోనూ, కనిపించిన లోపాలు సంకలనకర్తవి గానే గ్రహించి, సహృదయతతో మన్నించవలసినదిగా వేడుతున్నాను.

**గీతాజయంతి, 1997**

దీపశిఖ, NTPC Township
ఒరిస్సా 759 147

బాలగంగాధర పట్నాయక్
(సంకలన కర్త)

# విషయ సూచిక.

# శ్రీమద్ భగవద్గీతా పరిచయం.

## 1. భగవద్గీత హిందువుల మతగ్రంథమా?

ప్రతీ మతానికి ఒక మతగ్రంథం ఉంటుంది. ఆ గ్రంథాన్ని ఒక మతప్రవక్త వ్రాయడం గాని, చెప్పి వ్రాయించడంగాని జరిగియుంటుంది. కాని హిందువులు అనబడే వారికి మాత్రం ఒక నిర్దిష్టమైన మతగ్రంథం అంటూ ఏదీలేదు. కారణం-హిందూమతం అంటూ ప్రత్యేకమైన ఒకమతం ఏదీలేదు. సృష్టి ఆదిలో వెలువడిన వేదాల ఆధారంగా ఏర్పడిన ధర్మమే సనాతన ధర్మం అనబడి, వెలసింది. ఈ ధర్మాన్ని అనుసరిస్తున్నవారిని హిందువులనీ, వారి అనుష్ఠాన విధానాన్ని హిందూ మతమనీ, ఇతరులు పేర్కొని వ్యవహరింపగా, ఆ నామకరణం నిలిచిపోయింది.

వేద వాఙ్మయం అనంతం. దానిని అధ్యయనం చేయడానికి ఒక మానవ జన్మ చాలదు. మానవాళిపై అత్యంత కరుణచే అవతార మూర్తి అయిన కృష్ణద్వైపాయనుడు, అంతటా విడివిడిగా విస్తరించియున్న వేదాలను పొందుపరచి, విభజించి చతుర్వేదాలుగా గ్రంథస్థం చేసి, వేదవ్యాసునిగా ప్రసిద్ధికెక్కాడు. వేదశాస్త్రాల సారాంశాన్ని, తాను రచించిన మహాభారత, భాగవత, బ్రహ్మసూత్ర, అష్టాదశ పురాణాది గ్రంథాలలో పొందుపరచాడు. వేదాలకు చివరనుండు జ్ఞాన భాగాలను వేదాంతమనీ, ఉపనిషత్తులనీ అంటారు. ముఖ్యమైన 108 ఉపనిషత్తులలో, అతిముఖ్యమైనవి పది ఉన్నవి. మహాభారతాన్ని పంచమ వేదమంటారు. దాని మధ్యను, భీష్మ పర్వంలో 700 (701) శ్లోకాలతోనున్న భగవద్గీత ఒక మణిలాగ అమర్చబడింది. ఉపనిషత్తులలో, వేదాలయొక్క సారాంశం ఉన్నది. ఈ ఉపనిషత్తుల సారాంశమే భగవద్గీత అవటంచేత, గీతను , వేద, వేదాంత సారమనవచ్చును. వేదాంతాన్ని, అనుష్ఠాన సౌలభ్యం గురించి, సూత్రాల రూపంలో వ్రాయబడిన గ్రంథాన్ని బ్రహ్మసూత్రాలంటారు. ఉపనిషత్తులూ, బ్రహ్మసూత్రాలూ, భగవద్గీతా-ఈ మూడింటినీ ప్రస్థానత్రయం అంటారు. ఈ ప్రస్థాన త్రయమే హిందువుల ధర్మ గ్రంథం అనవచ్చును.

## 2. భగవద్గీత అంటే ఏమిటి?

భగవద్గీత అంటే భగవంతునిచే గానం చేయబడిన గీత అనే సామాన్యమైన అర్థం చెప్పుకొంటే సరిపోదు. భగవద్గీత, సర్వఉపనిషత్తుల సారము అనీ, బ్రహ్మవిద్య అనీ, యోగశాస్త్రమనీ చెప్పబడింది. వచనంలేకుండా, శ్లోకాలలో చెప్పబడింది గనుక, గీత అని యుంటారు.

**ఉపనిషత్తులు** :- సృష్టికర్త అయిన బ్రహ్మదేవుని ముఖతః వెలువడిన వేదాలలో, ప్రతీ వేదమూ, మూడు భాగాలలోనుంటుంది. 1. సంహిత(మంత్రభాగము), 2. బ్రాహ్మణము (కర్మకాండ), 3. ఉపనిషత్తులు(జ్ఞానభాగము లేదా వేదాంత భాగము) భగవద్గీతలో, ఉపనిషత్తుల సారమంతా ఇమిడ్చి శ్రీకృష్ణుడు, అర్జునుని, నిమిత్తంగా పెట్టుకొని, భావితరాల్లోని బుద్ధిమంతులను తరింపజేయడానికి, ఉపదేశించాడు. అందుచేత, ఉపనిషత్తుల సారమైన ఉపనిషత్తుగా ఈ గీతను వర్ణించారు.

**బ్రహ్మవిద్య**:- విద్యలలోకెల్ల అతి ఉత్కృష్టమైనది బ్రహ్మవిద్య. పరబ్రహ్మమును గూర్చి తెలియజేసేది బ్రహ్మవిద్య. ఏ విద్యను తెలుసుకొంటే ఇక తెలుసుకోవలసినది ఏమీ ఉండదో అదియే బ్రహ్మవిద్య. బ్రహ్మ విదుడు బ్రహ్మమే అవుతాడు. అలాంటి బ్రహ్మవిద్యయే గీతలో చెప్పబడింది.

**యోగశాస్త్రం** :- యోగం అంటే సాయుజ్యం. పరమాత్మతో జీవునికి సాయుజ్యాన్ని పొందించే సాధనమే యోగం. గీతలోని 18అధ్యాయాలూ ఒక్కొక్క యోగంగా చెప్పబడినా, అతి ముఖ్యమైన కర్మయోగ, రాజయోగ, భక్తియోగ, జ్ఞానయోగాల గురించి వివరంగా బోధింపబడింది. నేర్చుకొన్న బ్రహ్మవిద్యను అనుష్ఠానం చేసే విధానాన్ని యోగ శాస్త్ర మన్నారు. యోగాభ్యాసం చేసిన సాధకుడు, ఆధ్యాత్మిక రంగంలో పురోగమించడమే కాదు, ప్రాపంచిక రంగాల్లో కూడ సమర్థవంతుడవుతాడు. గీతలో శ్రుతులూ, స్మృతులూ, మేళవింప బడ్డాయి గనుక, దానిని సనాతన ధర్మగ్రంథ మనవచ్చును.

## 3. భగవద్గీతా ప్రాశస్త్యము:-

వేదాంత సారమంతా సుమారు 570 శ్లోకాల్లో నిమడ్చబడి, భగవానునిచే చెప్పబడిన ఇలాంటి ఆధ్యాత్మిక గ్రంథం, ప్రపంచంలో వేరొకటి లేదు. దీనిలో చెప్పబడిన సత్యాలు అన్నిదేశాలకూ, అన్ని మతాలకూ, అన్ని కాలాలకూ, చెందిన మానవాళి అంతటికీ వర్తిస్తాయి.

సాధారణంగా మతగ్రంథాలలో చోటు చేసుకొనే విధులూ, నిషేధాలూ, భగవద్గీతలోలేవు. హిందువులచే భగవంతునిగా ఆరాధింపబడే శ్రీకృష్ణునిచే చెప్పబడినది అనితప్ప, భగవద్గీతలో హిందూమత ప్రసక్తియే లేదు. ఏ ఒక్క మతానికీ

పరిమితంకాని విధంగా, విశాల విశ్వ మానవ జాతి అంతటికీ అన్వయించే వేదాంత సారాన్ని, భగవద్గీత, ప్రపంచానికి అందించింది. దేహేంద్రియ మనస్సులను నిగ్రహించి, నియమించి, బుద్ధిని సత్యశోధనలో నియోగించడమే సర్వసాధనల మూలసూత్రం. దీనినే గీత, వివరంగా బోధించింది. దేహేంద్రియ మనో బుద్ధులున్న ప్రతీ మానవునికీ ఈ గీతా సందేశం వర్తిస్తుంది. అందుకే దీనిని మానవతా మతగ్రంథం అనవచ్చు. మానవజన్మ లక్ష్యమేమిటో ఆ గమ్యాన్ని చేరడం ఎలాగో, పరిపూర్ణతను చెందడానికి ఏమిచెయ్యాలో, ఆయామార్గాలను గీత సూచించింది. సృష్టికర్తకూ, సృష్టికీ, సృష్టిలో శిరోభూషణ మనదగిన మానవునకూ, మధ్యనున్న సంబంధం ఎలాంటిదో, తెలియ జేసింది.

కర్మయోగ, రాజయోగ, భక్తియోగ, జ్ఞానయోగాది అనేక యోగాల గురించి చెప్పబడినా, గీతలో అన్ని యోగాలకూ సరియైన ప్రాముఖ్యతను ఇవ్వబడింది. అదియే గీత యొక్క ప్రత్యేకత. ఇతర గ్రంథాలు ఏదో ఒక మార్గాన్ని ప్రశంసించి, మిగిలినవన్నీ నిరర్థకం అని నిరసిస్తాయి. విశ్వమానవ జాతిలోని వ్యక్తులందరూ, సాత్త్విక, రాజసిక, తామసిక గుణాలలో ఏదో ఒకగుణ ప్రాధాన్యత కలవారైయుంటారు. ఆయా గుణాల ననుసరించియే, వారివారి సహజ స్వభావాలూ, ఇష్టా అయిష్టాలు, శ్రద్ధాశ్రద్ధలూ, ఆస్తిక నాస్తికత్వాలూ, ఏర్పడుతాయి. ఆయా స్వభావాలకు అనుగుణమైన మార్గాలే వారిని ఆకర్షిస్తాయి. అందుచేత అన్ని రకాల మానవులకూ సరిపడునట్లుగా వివిధమైన మార్గాలు నిర్దేశింపబడినవి, అందరినీ ఒకే మార్గాన్ని అవలంబించమంటే, ఆ మార్గం సరిపడని వ్యక్తులందరూ, వెనుకబడి పోయి, నిలిచిపోయి, భ్రష్టులై, నాస్తికులైపోతారు. గీత, ఇలాంటి అవాంతరం రాకుండా చేసింది.

మానవుడు పరిపూర్ణతకు ఎదగడానికి దోహదపడే మార్గాలన్నీ సమాన ప్రాధాన్యత కలవియే అని గీత గుర్తించింది. ప్రపంచంలోనుంటూ, ప్రాపంచిక ధర్మాలన్నీ నిర్వర్తిస్తూ కూడా, ఆధ్యాత్మిక సాధన అన్నివర్గాల వారూ చేయవచ్చునని స్పష్ట పరచింది. నశించే స్వభావం గల సమస్త దృశ్య జగత్తుకూ అతీతంగా అవినాశి అయిన ఆత్మ ఉందనీ, జనన మరణ విషవలయం నుండి విడివడడానికి, ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలనీ చెప్పింది. భగవద్గీత, మానవుణ్ణి దేవునితో

సాయుజ్యపరచే యోగశాస్త్రం. అందరి గమ్యస్థానమూ ఒక్కటే గనుక, తూర్పు పడమర దేశాలలోని వారందరినీ తరింప జేయగల దివ్యసందేశం ఈ భగవద్గీత.

భగవద్గీత ప్రపంచంలోని మేధావుల మన్ననలు పొందిన గ్రంథరాజము. ''గీతా, విశ్వజనని. ప్రపంచంలో ఇంకేదీ ఇవ్వలేని సుఖశాంతుల్ని గీతా మాత, నాకు, ఎప్పుడెప్పుడు, ఎన్నిసార్లు అడిగినా ఇస్తుంది. లేకుంటే, ఈ శారీరక, మానసిక బాధలకు, ఒత్తిడులకు, అలజడులకు, ఆశాభంగాలకు, నేను తట్టుకోగలిగే వాడిని కాదు'' అని అన్నారు మహాత్మాగాంధీ. ''కర్మ, భక్తి, జ్ఞానాలను సమన్వయపరచి, చరమదశకు తీసుకొనిపోగల గ్రంథరాజము ఈ భగవద్గీతయే. విశ్వసాహితిలో దీనికి ఏదీ సాటిరాదు. గీతా ప్రేమ జ్యోతిని గ్రహించిన వ్యక్తులు మానవాళిని అజ్ఞానాంధకారం నుండి బైటపడడానికి మార్గం చూపగలరు'' అని పండిత మదనమోహన మాలవీయ అన్నారు. ''మహాభారత యుద్ధ కాలం నుండి, కొన్నివేల సంవత్సరాలు గడిచినా, భగవద్గీతా తత్త్వం ఇప్పటికీ మాసిపోలేదు. మరుగున పడలేదు. మానవుడు ఉద్ధరింప బడడానికి కావలసిన ఆధ్యాత్మిక జ్ఞానం అంతా గీతలో నున్నది. అని ఒక మహనీయుడు చెప్పాడు. పాశ్చాత్త్య దేశీయులు కూడా గీతయొక్క గొప్పతనాన్ని స్వీకరించి, అనుసరించడానికి ప్రయత్నిస్తున్నారు.'' అని శ్రీ అరవింద యోగి అన్నారు. ''ఉపనిషత్తుల సారమైన భగవద్గీత, హిందూమతంలోని ఒక విభాగానికి గాని, లేదా ఒక్క హిందూ మతానికి గాని, చెందినది కాదు. మొత్తం విశ్వమానవాళికే జ్ఞాన ప్రకాశాన్ని ఇవ్వగల ఏకైక ఆధ్యాత్మిక మతము.'' అని శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ అన్నారు. ''భగవద్గీత, భారతీయులకే కాకుండా, మానవ జాతికే ఒక క్రమబద్ధమైన నిరంతర ఆధ్యాత్మిక త్త్వ స్రవంతిగా వెలసింది.'' అని ఆల్డస్ హక్స్లీ తత్త్వవేత్త చెప్పారు. ''భగవద్గీత జీవితం మీద విసుగెత్తిన ఏ కొద్దిమందో వృద్ధుల కాలక్షేపం గురించి చెప్పబడిన ఒక పాట కాదు. ప్రపంచంలో మానవుడు మనుగడను సాగిస్తూ, తన గమ్య మైన మోక్షాన్ని పొందగోరి, పురోగమించడానికి వేయబడిన ఒక చక్కని బాట'' అని లోకమాన్య బాలగంగాధర తిలక్ అన్నారు.

''ఈ గీతా జ్ఞానాన్ని ఆశ్రయించియే నేను ముల్లోకాలనూ పాలిస్తున్నాను'' అని శ్రీమహావిష్ణువే స్వయంగా చెప్పాడు.

భగవద్గీత ప్రపంచంలోని అన్ని ప్రముఖ భాషల్లోకి అనువదింప బడింది.

## 4. గీతోపదేశం ఎందుకు చేయబడింది?

ద్వాపర యుగం అంతమవడానికి ఇంకా 38సంవత్సరాలుండగా (1998 నాటికి సుమారు 5,137 సంవత్సరాలకు పూర్వం) ఒక మార్గశీర్ష శుద్ధ ఏకాదశినాడు ఈ పవిత్రమైన భగవద్గీతాగానం చేయబడింది. గీతోపదేశానికి ఎన్నుకోబడిన రంగస్థలమే ఒక అపూర్వమైనది. కురుక్షేత్ర రణరంగాన్నే భూమికగా తీసుకొని, శ్రీకృష్ణార్జునుల సంభాషణా రూపంలో, ధృతరాష్ట్రునికి సంజయుడు చెప్పినట్లుగా ఈ గీత రూపొందింప బడింది.

యుధిష్ఠిరుడు చేసిన రాజసూయ యాగ వైభవాన్ని కన్నులార చూచిన దుర్యోధనునికి పట్టరాని అసూయతో కన్నుకుట్టింది. పాండవుల్ని, తన బాటనుండి ఎలాగైనా తొలగించివేసి, వాళ్ల సామ్రాజ్య లక్ష్మిని స్వంతం చేసేసు కోవాలనే దుర్బుద్ధి కలిగి, కుతంత్ర విశారదుడైన తన మేనమామ అయిన శకునితో మంతనాలాడి, కుట్రపన్ని, ద్యూతప్రియుడైన యుధిష్ఠిరుణ్ణి జూదానికి పిలిచి, మోసంచేసి ఓడించాడు. పందెపు షరతుల ప్రకారం, ద్రౌపదితో సహా, పాండవులు 12 ఏళ్ల వనవాసమూ, ఒక సంవత్సరం అజ్ఞాతవాసమూ చేసి, తిరిగి వచ్చి, తమ రాజ్యాన్ని ఇచ్చివేయమని దుర్యోధనుని అర్థించగా, అతడు, ఇవ్వను పొమ్మన్నాడు. శ్రీకృష్ణుడు కూడా స్వయంగా వెళ్లి, నచ్చజెప్ప ప్రయత్నించినా ధుర్యోధనుడు పాండవులకు అర్ధరాజ్యం కాదుకదా, అయిదు గ్రామాలైనా, అయిదు గృహాలైనా ఇవ్వను సరికదా, సూదిమొన మోపినంత స్థలం కూడా ఇవ్వనని కూర్చున్నాడు. గత్యంతరం లేక పాండవులు, తమకు న్యాయంగా చెందవలసిన రాజ్యాన్ని పొందడానికి, యుద్ధానికి సిద్ధపడవలసి వచ్చింది. కౌరవులూ, పాండవులూ, తమతమ మిత్రరాజుల సైనిక సహాయం సేకరించారు. శ్రీకృష్ణుని సహాయం కోరడానికి, అర్జునుడూ, దుర్యోధనుడూ, ఒకే సమయంలో వెళ్లారు. శ్రీకృష్ణుడు తన నారాయణ సేన అంతా ఒక పక్షముననూ, నిరాయుధుడై యుద్ధము చేయని తానొక్కడూ ఒక పక్షముననూ, ఉంటామనీ, ఎవరికి ఏది కావాలో కోరుకొమ్మన్నాడు. అర్జునుణ్ణే మొదట కోరుకొమ్మంటే, అతడు నిరాయుధుడైన శ్రీకృష్ణుణ్ణే కోరుకున్నాడు. తనకు, శక్తివంతమైన యాదవసేన లభ్యమైనందుకు దుర్యోధనుడు మిక్కిలి సంతసించాడు. ఈవిధంగా అర్జునుని కోరికపై శ్రీకృష్ణుడు, కురుక్షేత్ర రణరంగంలో పార్థునికి సారధిగా నుండటానికి అంగీకరించాడు. యుద్ధం అనివార్యం అయింది.

11 అక్షౌహిణుల సైన్యంతో కౌరవులూ, 7 అక్షౌహిణుల సేనతో పాండవుల
నిలిచారు.

తన పుత్రులు సాగిస్తున్న యుద్ధం గురించి వార్తలు ఎప్పటి
తెలుసుకోవాలనే కోరికను అంధరాజైన ధృతరాష్ట్రుడు వ్యాస మహర్షికి తెలియ
ధృతరాష్ట్రుని కొలువులోని సంజయుడనే వానికి, వ్యాసుడు దివ్యదృష్టి నిచ్చి
భూమిలో చూస్తున్నదంతా ధృతరాష్ట్రుని చెంతనే కూర్చొని, అతని
చెప్తుండమని ఆదేశించాడు. భగవద్గీత అంతా, సంజయుడు దివ్యదృష్టితో
వింటూ ధృతరాష్ట్రునికి వినిపించినదే.

ఉభయ సేనలూ ఎదురెదురుగా బారులు తీర్చియున్నవి. రణరం
సన్నద్ధమై యుంది. రెండు సేనలలోని నాయకులూ, తమతమ శంఖాల
బాణాలను విడవడానికి సిద్ధంగా నున్నారు. అర్జునుడు తన పరాక్రమం చూ
శత్రువులను చెండాడడానికీ, తహతహ లాడుతున్నాడు. ఉరకలు
ఉత్సాహంతో, రథాన్ని రెండు సేనల మధ్యకు పోనిమ్మన్నాడు. శత్రువుల
లను అంచనా వెయ్యాలన్నాడు. దుర్యోధనుని గురించి ప్రాణాలు పోగొట్టు
ఎవరెవరు సిద్ధపడి వచ్చారో చూస్తానన్నాడు. అతడు కోరిన ప్రకారం శ్రీ
రథాన్ని రెండు సేనల మధ్య నిలిపాడు. అర్జునుడు రెండువైపులా చూశా

తనకు అత్యంత పూజనీయులైన భీష్మ పితామహుడూ,
ద్రోణుడూ, ప్రీతిపాత్రులైన తాతలూ, తండ్రులూ, మామలూ,
సంబంధులూ, బావలూ, మిత్రులూ, మొదలైన ఆప్తులంతా ఉభయ సైన్యా
కనిపించారు. ఈ యుద్ధంలో చంపబడడానికి సిద్ధపడి నిల్చున్న ఆత్మీయు
చూడగానే అర్జునునకు ఒక్కసారిగా జాలి పుట్టుకొచ్చింది.
ముంచుకొచ్చింది. ఇందరి చావుకు తానే కారకుడను కదా అనే భావం
శోకం కృంగదీసింది. తన మీద తనకే అసహ్యం కలిగింది. ఈ వీరులంతా
వారి భార్యల, కుటుంబాల, గతి ఏమి కానున్నదో అని విలపించాడు.
గురించి ఈ మారణ హోమం చేసేకంటే, సన్న్యసించి, బిచ్చమెత్తుకొని
మేలు కదా, అనుకొన్నాడు. ''నేను ఈ యుద్ధం చెయ్యను'' అని గాండీవా
పడవేసి, చతికిలబడ్డాడు.

విజయమే తప్ప, వెనుదిరగడం తెలియని విజయుడు. సర్వసన్నద్ధమై యున్న యుద్ధరంగంలో, ఈ విధంగా బేల అయి, నిర వీర్యుడై, నీళ్లు కారిపోయి, ఏడుస్తూ పారిపోయి, బిచ్చమెత్తుకుంటానని చతికిల బడిపోవడం, ఒక తీవ్రమైన అహంకార మమకార వ్యాధి లక్షణం అని గ్రహించిన శ్రీకృష్ణుడు, అర్జునునకు, అనేక విధాలుగా జ్ఞాన బోధచేసి, అజ్ఞానంతో కూడియున్న అతని భ్రమలను బాపి, స్వధర్మాచరణను తెలియజెప్పి, విద్యుక్త ధర్మ నిర్వహణకు ప్రేరణ కల్పించాడు. భగవానునిచే చేయబడిన ఈ జ్ఞాన బోధయే భగవద్గీతగా వెలసింది.

యుద్ధం చెయ్యను అని చతికిలబడిపోయిన అర్జునుడు, భగవానుని బోధను విన్న తరువాత, నాభ్రమలన్నీ తొలగిపోయాయి. నీ ఆదేశం ప్రకారమే నడుచుకుంటాను. కృష్ణా! అని లేచి నిల్చొని ఉరకలు వేస్తాడు. అతనిలో నిద్రాణమైయున్న కార్యదక్షత మేల్కొంది.

అశోచ్యా నన్వ శోచస్త్వం (శోకింపదగని విషయంగురించి- నీవు శోకిస్తున్నావు) అని ఉపదేశాన్ని ప్రారంభించి, మోక్షయిష్యామి మాశుచః (నీకు మోక్షాన్ని అనుగ్రహిస్తాను శోకించకు) అని భగవానుడు అభయమిచ్చి, ముగించిన ఈ గీతా శాస్త్రం, సకల శోకాల నుండి మానవుని రక్షిస్తుంది.

---

''క్షుద్రం హృదయ దౌర్బల్యం,త్యక్త్వా ఉత్తిష్ఠ పరంతపా!'' ఓ భారత వీరా! ఇలాంటి హృదయ దౌర్బల్యం అల్పులకు ఉండవలసినదయ్యా! నీలాంటి వీరులకు ఉండదగదు. లే! లేచి నిల్చొని రంగంలోకి ఉరుకు!

''సుదుఃఖే సమేకృత్వా, లాభాలా భౌజయా జయౌ'
తతో యుద్ధాయ యుజ్యస్వ, నైవం పాపమవాప్స్యసి'' (2.38)

(సమభావంతో యుద్ధంచేసినా, పాపమంటదు)

''సిద్ధ్య సిద్ధ్యోః సమోభూత్వా, సమత్వం యోగ ఉచ్యతే (2.48)

కార్యము సిద్ధించిననూ సిద్ధింపకున్ననూ, సమభావంతోనే కర్మచేయాలి. సమబుద్ధియే యోగము.

''జాతస్య హిధృవో మృత్యుః, ధృవం జన్మ మృత స్యచ
తస్మాదపరిహార్యేర్థే, సత్వం శోచితుమర్హసి॥ (2-27)

(తప్పింపవీలులేని వాటిగురించి, చింతించరాదు.)

## 5. గీతోపదేశం యుద్ధభూమి పై చెయ్యడం సమంజసమేనా?

ఉపనిషత్తులు ప్రశాంతమైన వాతావరణంలో తీవ్రమైన ధ్యానావస్థలోనున్న ఋషుల యొక్క మానసంలో స్ఫురించి, ప్రకాశింపబడే పవిత్ర దివ్య వాక్కులు. ఆధ్యాత్మిక బోధలన్నీ ప్రశాంతమైన పరిసరాల్లోనే చేయబడుతాయి. అయినప్పుడు మరి ఉపనిషత్తుల సారమైన భగవద్గీత, భీభత్సకరమైన రణరంగంలో చెప్పబడడం, వింతయే అనిపించవచ్చు.

అర్జునుడు సాటిలేని మేటివీరుడు. పాండవులకు దుష్ట దుర్యోధనాదుల వలన చిన్నప్పటినుండీ అల్లరులూ, అశాంతీ, భరించవలసి వచ్చేది. చివరకు, మోసగింపబడి, రాజ్యం పోగొట్టుకొని, అన్యాయయాలూ, అవమానాలూ ఎదుర్కోవలసి వచ్చినా, కురువృద్ధులైన భీష్మ, ధృతరాష్ట్రాదుల నుండి ఏవిధమైన న్యాయం జరుగక పోగా, శ్రీకృష్ణుని ప్రయత్నాలు కూడా విఫలమవగా, అతనిలో నిరాశా, నిఃస్పృహలతో పాటు, ప్రతీకారాగ్ని జ్వలింప సాగింది. శత్రువుల్ని చెండాడే తహతహలతో, అతడు యుద్ధ భూమికి వచ్చాడు. రెండువైపులా, యుద్ధానికి సిద్ధపడి నిలిచియున్న వీరుల నందరినీ చూచాడు. వారిలో కనిపిస్తున్న పెద్దలనూ, గురువులనూ, పిత్రుతుల్యులనూ, మహామహులనూ చూడగనే అతనికి ఒక్కసారిగా శోకం ముంచుకు వచ్చింది. ''అయ్యో! ఈ పూజ్యులూ, ఆప్త బంధువులూ, మిత్రులూ, అందరూ ఈ యుద్ధంలో చంపబడుతారు కదా! వారి భార్యా బిడ్డల గతి ఏమవుతుంది? దీని అంతటికి నేనే కారకుడను అవుతాను.'' అనుకుంటూ నిర్వీర్యుడై దుఃఖిస్తూ, ఏడుస్తూ ''నేను యుద్ధం చెయ్యను'' అని చతికిలబడి పోతాడు. అధర్మాన్ని ఎదుర్కోవాలనే క్షాత్ర శౌర్యం ఒకవైపూ, గురుభక్తీ బంధుప్రీతీ, మమకారమూ, వేరొకవైపూ లాగుతుండగా, తీవ్రమైన సంఘర్షణకు తట్టుకోలేక, ''శత్రువులు నన్ను చంప వచ్చినా, నేను మాత్రం వారిపై చెయ్యి ఎత్తను, సన్న్యసించి బిచ్చమెత్తుకొంటాను'' అంటూ స్వధర్మాన్నే విడిచి పారిపోవడానికి సిద్ధపడ్డాడు.

ఇటువంటి ఆత్యయిక విషమ సంకటస్థితిలో, శ్రీకృష్ణ భగవానుడు జోక్యం చేసుకోవలసివచ్చింది. మహాశక్తి సంపన్నుడైన అర్జునుడు ఈ విధంగా నిర్వీర్యుడై నీరుగారిపోవడానికి కారణం, అతన్ని ఆవేశించిన తీవ్రమైన వ్యామోహ జాడ్యం అని గ్రహించి, వెంటనే దానికి, ప్రాణరక్షణ చికిత్స చేయవలసిన అవసరం ఏర్పడింది గనుక, యుద్ధభూమిలోనే గీతామృత ఔషధాన్ని తినిపించాడు.

ఇంకొక విధంగా చూస్తే - శరీరమే ఒక కురుక్షేత్రము. మంచీ చెడు ంస్కారాలకూ, కర్మలకూ, కార్యక్షేత్రము, సకల సద్గుణ దుర్గుణాలకూ మనస్సే ుత్పత్తి క్షేత్రము. మంచీ చెడులకు నిరంతరం కొనసాగే సంఘర్షణయే కురుక్షేత్ర యుద్ధము. సంకట స్థితుల్లో, అణచివేయబడుతున్న ''మంచి'' యొక్క ఆర్తనాదాన్ని ని, మాధవుడు ఆదుకొంటాడు. ''చెడు''ను నిగ్రహించి బైటపడే మార్గాన్ని ాపుతాడు. ఏమి చెయ్యాలో పాలుపోని నిస్సహాయస్థితిలో, భగవానుడు గీతా ానాన్ని వినిపించి, కర్తవ్యాన్ని బోధిస్తాడు.

ఇంత దీర్ఘమైన ఉపదేశం పూర్తి అయేవరకూ శత్రు పక్షం వారు వేచి యుంటారా అనే సందేహం కూడా రావచ్చు.

గీతయొక్క 18 ఆధ్యాయాల సారాంశమూ, శ్రీకృష్ణ భగవానుడు ర్జునునకు 18 నిముషాలలోనో, లేదా 30-45 నిముషాల్లోనే చెప్పియుండవచ్చు. ానికి వ్యాస భగవానుడు ఒక సుందరమైన రూపాన్నిచ్చి, 700 శ్లోకాల గ్రంథంగా ర్చి దిద్దియుండవచ్చు. అర్జునుడు సామాన్యుడు కాడు. పాండవ పక్షంలోని తిముఖ్యమైన వీరుడు. శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవానుడే అని కౌరవుల సర్వసేనాని యిన భీష్మునికి తెలుసు. అందుచేత కృష్ణార్జునుల సంభాషణకు అంతరాయం లిగించడానికి ఎవ్వరూ సాహసించలేరు. ఈ సంభాషణ ఫలితంగా యుద్ధ విరమణ రిగినా జరుగవచ్చు అనే ఆశ కూడా కలిగియుండవచ్చు. ఆధునిక యుగంలో కూడా యుద్ధ విరమణ రేఖకు రెండువైపులా, సేనలు సర్వసిద్ధంగా, సంవత్సరాల కొద్దీ వేచి యుంటుంటారు. అందుచేత, కృష్ణార్జునుల సంభాషణ జరుగుతున్నంత సేపూ, నలు వేచియుండడం అసంగతం కాదు.

**. భగవద్గీతలో, అర్జునునికి యుద్ధం చేయమని శ్రీకృష్ణుడు ఒత్తిడి య్యడం, హింసకు పురికొల్పడం అనిపించుకోదా?**

ఇలాంటి వాదాలు, శాస్త్ర జ్ఞానం లేని వారూ, యదార్థ సత్యాలను వగాహనం చేసుకోలేని వారు చేస్తుంటారు.

అర్జునునకు యుద్ధ భూమిలో, క్షాత్ర ధర్మాచరణకూ, బంధు వ్యామోహానికీ ధ్య తీవ్రమైన సంఘర్షణ తలఎత్తగా, అతడు కర్తవ్య విమూఢుడై పడియున్న సంకట మయంలో, అతని యొక్క స్వధర్మాన్నీ ధర్మరక్షణ కర్తవ్యాన్నీ శ్రీకృష్ణుడు ర్తుచేశాడు.

దుర్యోధనాదులు ఆతతాయిలు, అయి యుండడం చేత, దండనార్హులు. ఆతతాయిలు ఎవరంటే- స్వార్థం గురించి అకారణంగా ఇతరుల ప్రాణం తీయు వారు, స్త్రీలను అవమాన పరచి, మానభంగం చేయ నుద్దేశించువారు, ఇండ్లకు నిప్పు అంటించువారు, విషప్రయోగం చేయువారు, ఇతరులను చంపప్రయత్నించు వారు, పరుల సంపదను హరింప దలచుకొన్న వారు. అటువంటి వాడు గురువైనా, వృద్ధుడైనా, బాలుడైనా, విద్వాంసుడగు, బ్రాహ్మణుడైనా, మరణ శిక్షార్హుడవుతాడు. అటువంటి వారిని అహింసా పరమోధర్మః అని ఉపేక్ష చేయరాదు. అతతాయి, తన అధర్మ వర్తనము చేతనే చంపబడుతాడు. దుర్యోధనాదులు పాండవుల పట్ల ఆతతాయి కృత్యాలన్నీ చేశారు. వారు, అప్పటి రాజ్యపాలకులై యుండేవారు గనుక, వారిని దండించే వారే లేకపోయిరి. వారికి దండన దైవమే విధించాలి. ఈ సందర్భంలో వారికి యుద్ధమే ఒక దైవ నిర్ణీతమైన దండనగా భావించాలి. ఎదుర్కోడానికి శక్తి ఉండీ కూడ, అధర్మాన్ని ఎదుర్కోకపోతే క్షాత్రధర్మ హాని కలిగి, నింద్యార్హ మవుతుంది. గీతోపదేశం ముగించి, ''అర్జునా! నేను ఉపదేశించిన ఈ జ్ఞాన బోధను బాగుగా విమర్శించుకొని నీకు ఎలాగ ఇష్టమయితే అలాగే చెయ్యి'' అని భగవానుడు చెప్పి, నిర్ణయాన్ని అర్జునునకే విడిచి పెట్టాడు.

ఆధునిక కాలంలో, నేరస్థులను శిక్షించడం న్యాయాధిపతియొక్క ధర్మం. చట్టం ప్రకారం శిక్షవిధించే బదులు, అహింస పేరిట, అయ్యో! పాపం అని, నేరస్థులను విడిచి పెట్టేసే న్యాయాధిపతి, నేరాన్ని ప్రోత్సహించిన అధర్మ వర్తనుడని నిందింప బడుతాడు.

కురుక్షేత్ర యుద్ధం జరగడానికి ఒక దైవ సంకల్పం కూడా ఉంది. సృష్టిలోని జీవరాశుల యొక్క పుట్టుక పోషణ, పతనాలను రచించి, నిర్వహించే కర్తవ్యము భగవంతునిది. దేవతలచే చంపబడిన రాక్షసులందరూ ద్వాపర యుగంలో, భూమండలంలో రాజులుగా జన్మించి, అహంకార బలగర్వాలతో మదించిన వారై కామక్రోధాది గుణాలతో నిరంకుశులై విజృంభించేవారు. వారు లోక కంటకులై భూమికి భారంగా తయారయ్యారు. భూదేవి విలపించగా, బ్రహ్మాది దేవతలు మహావిష్ణువును ప్రార్థించారు. తాను భూలోకంలో శ్రీకృష్ణునిగా అవతరించి, రాజులను అంతంచేసి, భూభారాన్ని తగ్గించి, సాధు సజ్జనులను రక్షిస్తానని మహావిష్ణువు అభయమిచ్చాడు.

ఆ విధంగా జరిపించడమే శ్రీకృష్ణుని అవతార కార్యమైనది. రాజులనే కాకుండా స్వ, పర, భేదం లేకుండా, తనయొక్క పుత్ర పౌత్రాది యాదవ బంధువుల నందరినీ, తాను ఈ భూమండలాన్ని విడిచి వెళ్లక పూర్వమే, అంతమొందించే కార్యక్రమాన్ని చేపట్టాడు శ్రీకృష్ణుడు. ఈ జన నిర్మూలనం, అర్జునుడు యుద్ధం చేయకుండా పారిపోయినా సంభవించి యుండేది. రాక్షస ప్రవృత్తిగల రాజులూ, దుర్యోధన సోదరులూ, రానున్న కలియుగ ప్రభావంచేత, యాదవుల వలె, తమలో తాము కలహించుకొని, అంతం చేసుకొని, నరకానికి పోయి యుందురు. కాని, కురక్షేత్ర రణరంగంలో మరణించడం చేత, వారికి వీర స్వర్గమే ప్రాప్తించి యుంటుంది.

జీర్ణించిపోయిన పురాతన కట్టడాలను పడగొడ్తేనే గాని, సుందరమైన ఆధునిక భవనాలు నిర్మింపబడవు. పురాతన సృష్టి నశిస్తేగాని, నూతన సృష్టికి ఆస్కారం ఉండదు. ఈ విధంగా ''గతం'' యొక్క శిథిలాలపైనే ''భావి'' ఆవిర్భవిస్తుంది. ఇదియే విశ్వ ప్రగతియొక్క పురోగమనం. ప్రకృతి సహజమైన పరిణామ సూత్రము. ఇది ఒకరి ప్రేరణ, ప్రమేయాల వలన జరిగేది కాదు. అందరూ ఈ జగన్నాటక పోకడలో, నిమిత్తమాత్రులైన పాత్రధారులే.

యుద్ధం జరగడం, జనక్షయం అవడం, అంతా భగవంతుని బృహత్ పథకంలోని, అనివార్య సంఘటనలేగాని, ఎవరి ప్రేరణచే కలిగినవి కావు. ఈ యదార్థ తత్త్వాన్ని గ్రహించలేనివారు, తమతమ సంస్కారాను గుణంగా, అనేక విధాలుగా భావిస్తుంటారు.

## 7. బ్రహ్మము అంటే ఏమిటి?

బ్రహ్మము, పరబ్రహ్మము, ఆత్మ, పరమాత్మ, ఈ శబ్దాలన్నీ ఒకే ఒక అద్వితీయ తత్త్వాన్ని సూచిస్తాయి. బ్రహ్మము అంటే మహాదొడ్డది, దాని కంటే గొప్పది ఏదీ లేనట్టిది, అనేది సామాన్యపు అర్థము. కాని వేదాంత పరిభాషలో ''బ్రహ్మ'' శబ్దాన్ని ఒక ఉత్కృష్టమైన అనిర్వచనీయమైన అద్వితీయమైన తత్త్వము లేదా మహాశక్తిని సూచించునట్టిదిగా వ్యవహరించారు. సృష్టికి పూర్వము, బ్రహ్మము తప్ప ఇంకేదీ ఉండేది కాదు.

నామరూప గుణాలు లేని ఈ తత్త్వాన్ని నిర్వచించడానికి మానవులకే కాక, బ్రహ్మాది దేవతలకు కూడా సాధ్యపడదు. వేదాలు కూడా వర్ణింపలేక పోయినవి.

అందుచేత, ఋషులు తమకు తెలిసినంత వరకూ చెప్పి, ఆపైన, ఇదికాదు, ఇదికాదు, ఇది బ్రహ్మముకాదు. వీటికి పరమైనది ఒకటి ఉంది అన్నారు. అలాగ చెప్పడం తప్ప వేరొక మార్గం లేదు. బ్రహ్మము యొక్క లక్షణాలు, సత్ చిత్ అనందమనీ, సత్యం జ్ఞానం, అనంతం బ్రహ్మమనీ, మాత్రం చెప్పగలుగుతున్నారు. బ్రహ్మస్వరూపాన్ని భాష ద్వారా పరిచయం చేయడానికి ఇంతకన్న శ్రేష్ఠమైన శబ్దాలు లేవు. ప్రత్యక్షానుభవం వినా వేరు మార్గం లేదు.

సమస్త భూతాలూ, సకల ప్రాణులూ, ఎవని వలన పుట్టి, ఎవనిని ఆశ్రయించి జీవించి, ఎవనియందు లయించుతాయో, అతడే బ్రహ్మము. అతడు భూమికంటె, ఆకాశము కంటె బృహత్తముడు, అవ్యక్తుడు, నిత్యుడు, పూర్ణుడు, పరిశుద్ధుడు, సర్వవ్యాపి, జన్మలేనివాడు, మనస్సు లేనివాడు, మనోవాక్కులకు అందనివాడు, దేశకాల వస్తువులచేత అపరిచ్ఛిన్నుడు, త్రిగుణ రహితుడు, నామరూపాలు లేనివాడు. ఆది, మధ్య, అంత, రహితుడు. మానవుని భాషా జ్ఞానంచే వర్ణింప శక్యముకానివాడు.

సర్వమూ ఆ పరబ్రహ్మము తప్ప వేరు ఏమీ లేదు. మానవుని యొక్క పరిమితమైన ఊహాజ్ఞానానికి గోచరింపని విధంగా విశ్వమంతటా వ్యాపించియుండే ఏకైక శక్తినే, నిర్గుణ బ్రహ్మ, పరబ్రహ్మ, ఆత్మ, పరమాత్మ అని అంటారు. ఇలాంటి నామరహిత నిరాకార నిర్గుణ సర్వవ్యాపి అయిన బ్రహ్మమును మానవమాత్రుడు ఎలాగ దర్శించగలడు, ఏవిధంగా ఆరాధించగలడు? నిర్గుణ బ్రహ్మన్ని తెలుసుకోడానికి అతి సూక్ష్మమైన బుద్ధి అవసరం. బ్రహ్మానుభూతిని పొందడం బహుకష్ట సాధ్యం. నిర్గుణ బ్రహ్మోపాసన బుద్ధికి సంబంధించినది. సగుణోపాసన మనసుకు చెందినది. మిక్కిలి సూక్ష్మమైన అంతర్దశలో నున్న మనస్సే బుద్ధి అనబడుతుంది. బుద్ధికి సంబంధించినది జ్ఞానము. మనస్సుకు సంబంధించినది భక్తి. నిర్గుణ బ్రహ్మ మాయ( ప్రకృతి) తో చేరి, సగుణమై భగవంతునిగా వెలసాడు. ఈ భగవంతుడే (ఈశ్వరుడే) విశ్వం యొక్క సృష్టి స్థితి లయాలకు కర్తయై, జగన్నియామకుడై, భక్తులు ఆయన్ను అనేక రూపాలలో వివిధ పద్ధతుల్లో ఆరాధించడానికి అవకాశం కల్పించాడు. భక్తి, జ్ఞానంగా పరిణమించి, నిర్గుణ బ్రహ్మోపాసనకు దారితీస్తుంది. దివ్యప్రేమ, భక్తి, జ్ఞానమూ, ఒకదాని యందొకటి గుంభితం అయియుంటాయి. నిర్గుణ బ్రహ్మ, సగుణ బ్రహ్మ అని ఇద్దరు

ఉన్నట్టుగాని, ఆత్మ, పరమాత్మకు భిన్నంగా పరమేశ్వరుడు, ఈశ్వరుడు, భగవంతుడు, అంటూ అనేకులు ఉన్నట్టుగాని భావించరాదు. ఏకం సత్, విప్రా బహుధా వదంతి ( ఒకే ఒక సత్యాన్ని విజ్ఞులు, పండితులు, పలురకాలుగా వివరిస్తారు) అన్నారు. ఏకం ఏవ అద్వితీయం బ్రహ్మ(రెండవది అంటూ ఏదీలేని ఏకైక తత్త్వాన్నే బ్రహ్మం అంటారు).

అయితే ఈ బ్రహ్మాన్ని దర్శించడం ఎలాగ? ధ్యానము, సమాధి, ఏకాంత ఉపాసన, బ్రహ్మ విచారాది సాధనలలో మనోబుద్ధులను లగ్నం చేసే సాధకునకు బ్రహ్మసాక్షాత్కారం కలుగుతుంది. ఈ స్థితిలో జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానముల భేదము తెలియదు. ఇతరులెవ్వరికీ తెలియ జెప్పడం అవదు. ఈ అవస్థను నేను అనుభవించ్చాను. అని కూడా చెప్పడం అవదు. ఏలనన, చెప్పువాడు, వినువాడు, చెప్పబడునది, ఆ స్థితిలో అంతా ఏకత్వమే, ద్వితీయ భావన రాగానే అంతా అదృశ్యమై పోతుంది. ఆ ఏకత్వ స్థితియే బ్రహ్మానంద స్థితి. బ్రహ్మవిత్ బ్రహ్మ ఏవ భవతి. ( బ్రహ్మమును తెలుసుకొన్నవాడు బ్రహ్మమే అవుతాడు), సముద్రంలో కలిసిన నది తన ''నది'' త్వాన్ని కోల్పోయినట్లు. జీవాత్మ పరమాత్మ అవుతుంది.

## 8. భగవంతుడు అంటే ఎవరు?

సృష్టికి పూర్వం ఉండియున్న ఏకైక, అవ్యక్త, అనిర్వచనీయ నిర్గుణ శక్తినే బ్రహ్మము, పరబ్రహ్మము, పరమాత్మ, అని అన్నారు. ఈ పరబ్రహ్మము యొక్క సగుణ రూపాన్నే పరమేశ్వరుడు, పురుషోత్తముడు, భగవంతుడు, అనే వివిధ నామాలతో పేర్కొన్నారు. ఈ పరమేశ్వరుడే ''ఏకము'' నుండి ''అనేకం'' అవాలని సంకల్పించి, తన శక్తిలోని ఒక నాల్గవ భాగ అంశాన్ని వినియోగించి, ''మాయ'' ను సృజించాడు. ఈ మాయనే, మహామాయ, యోగమాయ అని అంటారు. ఈ మాయయే, కాలమూ, సత్త్వ రజస్తమోగుణాలనబడే త్రిగుణాలతో కూడి, మూలప్రకృతి అయింది. ఈ ప్రకృతియే సమస్త సృష్టికీ ఉత్పత్తి స్థానం అయింది. భగవంతుడు ఈ విధంగా విశ్వ సృష్టిని ప్రారంభించాడు. అతడు అద్వితీయుడు, వ్యక్తా వ్యక్తుడు ( ఇంద్రియ అగోచరుడూ, గోచరించువాడూ) సగుణ నిర్గుణుడు (నామరూపాది గుణములు కలవాడూ, ఏవీ లేనివాడూ) స్వయంప్రకాశ్యుడు, చైతన్య స్వరూపుడు, విశ్వమంతా అణువణువునా వ్యాపించి యున్నవాడు, జన్మలేని వాడు,

అనంతుడు, అవ్యయుడు. అతడు మాయాతీతుడు, కాలాతీతుడు, త్రిగుణాతీతుడు, ప్రకృతికి ప్రభువు. భగవంతుడు ఏకైక పరమేశ్వరుడు.

## 9. భగవంతుడు ఒక్కడే అయినప్పుడు, మరి హిందువులు ఇందరు దేవుళ్లను కొలుస్తారెందుకు :-

ఇంద్రియ అగోచరమైన నిర్గుణ నిరాకార భగవత్ తత్త్వాన్ని గ్రహించడం సులభసాధ్యం కానందున, మానవులకు ఉపాసనా సౌలభ్యం కలిగించడానికి, పరమేశ్వరుడే అనేక రూప, నామ, గుణ విశేషాలతో వెలుస్తాడు. లింగ భేదమే లేని పరమాత్మ, స్త్రీపురుష దేవతా స్వరూపాల్లో వెలుస్తుంది. పరమేశ్వరుని యొక్క అసంఖ్యాకమైన దివ్య శక్తుల్లో నొక్కొక్క శక్తికీ ప్రతినిధిగా ఒక్కొక్క దేవతామూర్తి నియోగింప బడింది. ఉదాహరణకు-సృజన శక్తికి బ్రహ్మదేవుడూ,పోషణ, రక్షణ, పరిపాలనలకు విష్ణువూ, ఉపసంహారానికి శివుడూ పేర్కొనబడ్డారు. ఈ విధంగా ఇంద్రాది దేవతలూ, సూర్యచంద్ర దిక్పాలకులూ, లక్ష్మి, సరస్వతీ, పార్వతీ మొదలైన స్త్రీదేవతలూ, గణేశ కార్తికేయాది బాల దేవతలూ ఆరాధ్య దేవతలయ్యారు.

విశ్వపరిపాలన, సంరక్షణ, పోషణల కర్తవ్యం గల విష్ణుమూర్తి, ధర్మగ్లాని కలిగినప్పుడెల్లా, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మోద్ధరణ చేయడానికి భూలోకంలో అవతరిస్తుంటాడు.

విభిన్న నామ రూప గుణ విశేషాలు కలిగియున్నప్పటికీ, ఈ దేవతా స్వరూపాలన్నీ ఆ ఏకైక పరమేశ్వరుని యొక్క శక్తి అంశాలకు ప్రతీకాలే అని తెలుసుకోవాలి. సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి ( అన్ని దేవతలకూ పెట్టబడిన నమస్కారాలు ఆ కేశవుణ్ణే చేరుతాయి.) అని అన్నారు. ఏయే భక్తుడు ఏయే దేవతల

---

''ఈశ్వరః సర్వభూతానాం, హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని, యంత్రారూఢాని మాయయా'' **(18-61)**

**అర్జునా! పరమేశ్వరుడు సర్వభూతముల హృదయసీమ యందు నివసించి యున్నాడు. తన మాయచే సర్వభూతాలనూ, యంత్రాన్ని ఆరూఢించే వారివలె, గిరగిర త్రిప్పుతుంటాడు.**

ధిస్తాడో, ఆయా దేవతల ద్వారానే నేను, వానికి ఆయా ఫలాలను గ్రహిస్తాను- అని గీతలో భగవానుడు చెప్పాడు.

అందుచేత, ఈరోజుల్లో వినవస్తుండే - ఈదేవుడు గొప్ప, ఆదేవత ఇతరుల ి గొప్ప - లాంటి మాటలు అజ్ఞానంతో కూడియున్న అర్థంలేని మాటలు.

అన్ని దేవతాస్వరూపాలూ, ఆపరమేశ్వరుని యొక్క ప్రతీకాలే అని సుకొన్న వారు కూడా, తమతమ పూర్వసంస్కారానుగుణంగానూ, తమతమ జ స్వభావాల్లో నిక్షిప్తమైయున్న త్రిగుణాల ప్రభావంచేతనూ, తమ అభీష్టానికి ోయిన ఇష్టదేవతా స్వరూపాల్నే ఆరాధిస్తారు. అదియే వారికి అత్యంత ందాన్నిస్తుంది. ఆస్వేచ్ఛయే లేకపోయి, అందరూ నిర్గుణోపాసనే చెయ్యాలి ాని లేదా! ఒకే ఒక రూపాన్నే కొలవాలి అనిగాని, నిర్దేశిస్తే, అలాగ చెయ్యలేని మనస్సు, దేవునియందు లగ్నంకాక, భక్తి శ్రద్ధలు వృద్ధిచెందక, అట్టివారు కబడిపోయి భ్రష్టులయి పోయే స్థితివస్తుంది. అందుచేతనే హిందూ ఆరాధనా తిలో ఒక ప్రత్యేకమైన, వాంచనీయ మైనవైవిధ్యం ఉంది. దానివలన, అన్ని రకాల ్ఠలకూ ఆరాధనా సంతృప్తి లభ్య మవుతుంది.

## .సృష్టి ఎలాగ జరిగింది?

సృష్టికి పూర్వం పరబ్రహ్మం (పరమాత్మ) తప్ప, ఇంకేమీ ఉండేది కాదు. కము'' అయి యున్న తన నుండి ''అనేకం'' సంభవించాలని ఆ పరమాత్మ కల్పించింది,. ఆ పరమాత్మ నుండి ఒక శక్తి ఉద్భవించింది. దానినే మాయ, ద్య, మూల ప్రకృతీ అన్నారు. అది ''కాలము'', త్రిగుణాలుతో కూడి, ినాత్మక ప్రకృతి అనబడింది. ఈ ప్రకృతి సృష్టి కార్యానికి ఉపక్రమించింది. ినుండి, మహత్‌తత్త్వం అనబడే జ్ఞాన శక్తిలేదా బుద్ధి ఉదయించింది. దాని నుండి,

---

''యోయో యాంయాం, తనుం భక్తః, శ్రద్ధ యార్చితు మిచ్ఛతి ।
తస్య తస్యా చలాం శ్రద్ధాం, తామేవ విదధా మ్యహం'' (7-21)

**్జునా! ఏయే దేవతలను భక్తుడు శ్రద్ధతో కొలుస్తాడో, ఆయా దేవతలపై శ్రద్ధనే నేను వారి ందు స్థిరపరచుతాను.**

త్రిగుణాలతో కూడియున్న అహంకారం ఏర్పడింది. సాత్త్వికా హంకారం నుండి, ఇంద్రియాలకూ, మనస్సుకూ అధిష్ఠాన దేవతలైన అగ్నిదేవుడు, వరుణుడు, అశ్వినీ కుమారులు, సూర్యుడు, వాయువు దిక్ దేవతలు, ప్రజాపతి, మిత్రుడు, ఇంద్రుడు, విష్ణువు, చంద్రుడు, రుద్రుడు, బ్రహ్మ, ఉద్భవించారు. రాజసాహంకారం నుండి, చెవులు, కన్నులు, చర్మము, నాలుక, ముక్కులతో పంచ జ్ఞానేంద్రియాలూ, వాక్కు, చేతులు, పాదాలు, గుదము, గుహ్యములతో పంచ కర్మేంద్రియాలూ, పుట్టినవి. తామస సాహంకారం నుండి, శబ్దము, రూపము, స్పర్శ, రసము, గంధములతో పంచతన్మాత్రలూ, ఆకాశము, వాయువు, అగ్ని జలము పృథ్విలతో పంచ మహాభూతాలూ, పుట్టినవి. తరువాత, శబ్దం నుండి ఆకాశం పుట్టింది. శబ్దంతో కూడియున్న ఆకాశము, స్పర్శ తన్మాత్రతో చేరి, వాయువును పుట్టించింది. శబ్ద స్పర్శలతో కూడియున్న వాయువు, రూపతన్మాత్రతో కూడి, తేజస్సునూ( అగ్నినీ), శబ్దస్పర్శ రూపాలతో కూడియున్న అగ్ని రసతన్మాత్రతో చేరి, జలమునూ, శబ్దస్పర్శ రూప రసాలతో కూడియున్న జలము, గంధ తన్మాత్రతో చేరి, పృథ్వినీ పుట్టించాయి.

ఇవి అన్నీ ఉద్భవించిననూ, వాటి వంట్టకు అవి విడి విడిగానే ఉండిపోయాయే గాని సంయోగంలేక ఉత్పాదన ఏమీ జరుగలేదు. అందుచేత ఆ శక్తులన్నీ, తమకు సృష్టికార్యాన్ని నిర్వహించే జ్ఞానమూ, శక్తి సామర్థ్యాలనూ కలుగజేయుమని భగవంతుని వేడుకొంటాయి. పరమేశ్వరుడు కరుణించి, కాలము, ప్రకృతి, మహత్తు, ఇంద్రియ తన్మాత్రాదులైన 27తత్త్వాల యందు ప్రవేశించి తన చైతన్య శక్తిచే వాటిని సంఘాత పరచగా సృష్టికి బీజాంకురము అయింది. దీనినే ప్రకృతి పురుషుల సంయోగ మంటారు. దీనిచే ఒక అండము పుట్టింది. ఈ అండమే జలగర్భంలో వెయ్యిసంవత్సరాలుండి, ఈశ్వరచైతన్య శక్తిచే పెరిగి పెరిగి బ్రహ్మాండంగా తయారయి, సమస్త సృష్టికీ గర్భం అయి, విరాట్ స్వరూపంగా వ్యక్తమయింది. ఇదియే, పరమేశ్వరుని యొక్క ప్రప్రథమ అవతారమైన ఆదిపురుషుడు.

విరాట్ పురుషుని నుండి, దైవమూ, ఆత్మ( జీవాత్మ), కర్మ అనబడు శక్తులు ఉద్భవించాయి. కర్మ శక్తి నుండి, ప్రాణ, అపాన, వ్యాన, సమాన, ఉదాన అనబడు పంచప్రాణాలూ, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ, అనబడు ఐదు.

ఉపప్రాణాలూ, స్పందించాయి, తరువాత తెలుసుకొనే శక్తి అయిన ప్రజ్ఞ ఏర్పడుతుంది. విరాట్ స్వరూపం నుండి సమస్త భూతాలూ జీవరాశులూ పుట్టి, విశ్వం ఏర్పడింది. ఈ విరాట్ స్వరూపమే ఈశ్వరునకు స్థానమై, జీవులకు ఆత్మ అయి వెలసింది.

విరాట్ పురుషునికి నోరు ఏర్పడి అక్కడికి వాక్ శక్తితో అగ్నిదేవుడు ప్రవేశించాడు. నాలుక ఏర్పడి అక్కడికి రస శక్తితో వరుణుడూ, నాశిక ఏర్పడి, ఆఘ్రాణ శక్తితో అశ్వినీ దేవతలూ, చక్షుద్వయం ఏర్పడి, రూపదర్శన శక్తితో సూర్యుడూ, చర్మం ఏర్పడి, స్పర్శ శక్తితో వాయువూ, కర్ణద్వయం ఏర్పడి, శబ్దగ్రహణ శక్తితో దిగ్ దేవతలూ, ప్రవేశించారు. పురుషాంగం ఏర్పడి, బీజ శక్తితో ప్రజాపతి,గురుస్థాన మేర్పడి, మలవిసర్జన శక్తితో మిత్రుడూ, చేతులు ఏర్పడి, ఇచ్చిపుచ్చుకొనే శక్తితో ఇంద్రుడూ, పాదాలు ఏర్పడి, గమనశక్తితో విష్ణువూ, హృదయం, మనస్సూ ఏర్పడి,సంకల్ప వికల్ప శక్తితో చంద్రుడూ, అహంకారం ఏర్పడి, కర్తవ్య పాలనా శక్తితో రుద్రుడూ, బుద్ధి చిత్తాలు ఏర్పడి గ్రహణ విచక్షణ విజ్ఞాన శక్తులతో, బ్రహ్మ ప్రవేశించారు.

విరాట్పురుషుని శిరస్సునుండి స్వర్గము, పాదాలనుండి భూమి, నాభినుండి ఆకాశమూ, నోటినుండి వేదాలూ, బ్రాహ్మణులూ, చేతులనుండి క్షత్రియులూ, తొడల నుండి వైశ్యులూ, పాదాలనుండి శూద్రులూ వెలువడ్డారు.

విరాట్పురుషుని నుండి ఉద్భవించిన సృష్టియే కాకుండా, బ్రహ్మదేవునిచే కూడా కొంత సృష్టిచేయబడింది. వృక్షజాతులూ, జంతుజాతులూ, మానవజాతి, దేవసర్గ ( పితృదేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, అప్సరసలు, మొదలైన వారంతా) బ్రహ్మచే సృజింప బడినవారు.

ఈ విధంగా, ప్రతీ కల్పారంభంలోనూ సృష్టి జరుగుతుంది. కల్పాంతంలో అంతా బ్రహ్మదేవుని యందులయించి, మళ్లీ కల్పారంభంలో పునః సృష్టి జరుగుతుంది. కల్పాది అంటే బ్రహ్మదేవుని పగటి సమయం. కల్పాంతం అంటే

# సృష్టి క్రమము

| నిర్గుణ బ్రహ్మము. | | సగుణ బ్రహ్మము. |
|---|---|---|
| బ్రహ్మము, పరబ్రహ్మము, పరమాత్మ అన్నీ ఒక్కటే. ఏకమే వాద్వితీయం బ్రహ్మ అనీ, సత్యం, జ్ఞానం అనంతం బ్రహ్మ అనీ, ఆది, అవ్యక్తమూ, స్వయంప్రకాశ్యమూ నామరూప గుణ రహితమూ అని అన్నారు | = | పరమేశ్వరుడు, పురుషోత్తముడు, భగవంతుడు అనబడే వాడు సచ్చిదానంద స్వరూపుడు, చైతన్య స్వరూపుడు, స్వయం ప్రకాశ్యుడు, నామరూప గుణవిశేషాలతో స్తుతింప బడేవాడు, ఆది మధ్యాంత రహితుడు, జగత్ కారణుడు, అనంతుడు జన్మలేని వాడు, అద్వితీయుడు అయినట్టి భగవంతుడు ''అనేకం'' అవాలని సంకల్పించి ... |

↓

తన అనంత శక్తిలోని ఒక అంశాన్ని సృష్టి కార్యంలో నియమించాడు.
అదియే, మాయ, అవిద్య, మూల ప్రకృతి, యోగమాయ అనబడింది.

\+

అధి, కాలము, +

\+

త్రిగుణాలతో కలసి =

సృజనాత్మక ప్రకృతి అయింది.

↓

దాని నుండి మహత్ తత్త్వము ( జ్ఞాన శక్తి) పుట్టింది

↓

దాని నుండి అహంకారం పుట్టింది

↓

( తరువాతి పుటలో చూడండి

( వెనుకటి పుట నుండి :-

# సృష్టి క్రమము :

**అహంకారము (3 విధాలు), అవి:**




అన్నీ సంఘాతమయి అండము ఉద్భవించింది.

అది పెరిగి పెరిగి, బ్రహ్మాండముగా ఎదిగి, దాని నుండి :

నారాయణుడు, ఆది పురుషుడు, విరాట్ స్వరూపుడు, వైశ్వానరుడు, ఈశ్వరుడు అనబడు, పరమేశ్వరుని ప్రప్రథమ అవతారం వెలసింది.

ఈ విరాట్ పురుషునకు 3 శక్తులున్నవి. అవి :




విరాట్ పురుషుని నుండి ఉద్భవించిన బ్రహ్మ, ఋషులనూ, దేవతలనూ, గంధర్వ, కిన్నర, కింపురుష, అప్సరస, పితృ దేవతాదులనూ, యక్ష రాక్షస భూత పిశాచాది గణాలనూ, మానవ, జంతు, పక్షి, వృక్ష, నాగ, కీటకాది జీవజాతులనూ, సృష్టించాడు.
(ఈ సృష్టి చిత్రానికి ఆధారం శ్రీమద్ భాగవతం)

## 11. ప్రళయం అంటే ఏమిటి?

పుట్టిన ప్రతీ వస్తువు, లయిస్తుంది. లయించడమంటే సమసిపోవడం, లీనమైపోవడం, లేకుండా పోవడం. సృష్టి కూడా లయిస్తుంది. అంతా ఒక్కసారే లయించి పోవడాన్ని ప్రళయం అంటారు.

మానవ కాలమానం సూర్య చలన ఆధారంగా లెక్కింప బడుతుంది. మానవులకు ఒక సంవత్సరం గడిస్తే దేవతలకు ఒక దినం- అంటే 360 రెట్లు. 360 దివ్య దినాలు, ఒక దివ్య సంవత్సరం. కృతయుగ కాలం 4వేల దివ్యసంవత్సరాలు; త్రేతాయుగ కాలం 3వేల దివ్య సంవత్సరాలు, ద్వాపరయుగకాలం 2వేల దివ్యసంవత్సరాలు, కలియుగ కాలం 1వెయ్యి దివ్యసంవత్సరాలు. ప్రతీ యుగ అంతంలో, తరువాతి యుగం ప్రారంభించక పూర్వం, ఒక సంధి కాలం ఉంటుంది. ఆ సంధి, గతించిన యుగకాలంలో 20శాతం ఉంటుంది. సంధికాలాలతో పాటు నాలుగు యుగాల కాలం 12వేల దివ్య సంవత్సరాలు. (43లక్షల 20వేల మానవ సం॥లు) దీనిని ఒక మహాయుగం, లేదా, చతుర్యుగం అంటారు. ఈ చతుర్యుగ క్రమం, మళ్లీ మళ్లీ పునరావృతం అవుతూ ఉంటుంది. ఇలాంటి చతుర్యుగాలు ఒక వెయ్యి గడిస్తే బ్రహ్మదేవునికి ఒక పగలు (కల్పం) అవుతుంది. అంతే కాలం, ఒక రాత్రి అవుతుంది. పగలూ, రాత్రీ కలిసి ఒక బ్రహ్మదినం (864 కోట్ల మానవ సంవత్సరాలు). అలాంటి 360 బ్రహ్మదినాలు ఒక బ్రహ్మ సంవత్సరం. 100 బ్రహ్మసంవత్సరాలు, ఒక బ్రహ్మ (కాలం) ఆయుర్దాయం. బ్రహ్మకు ఇప్పుడు 51వ సంవత్సరం నడుస్తుంది. ఇప్పటికి 3లక్షల 60వేలకు పైగా మహాయుగాలు పునరావృతం అయియుంటాయి, 18వేలకుపైగా నైమిత్తిక ప్రళయాలు జరిగి యుంటాయి.

బ్రహ్మదేవునికి పగలు (కల్పం) ఆరంభమైతే, అతనిచే చేయబడునట్టి సృష్టి ప్రారంభం అవుతుంది.కల్పాంతంలో(రాత్రి ప్రవేశించగానే) అతని యొక్క సృష్టి అంతా అంతమయి, సూక్ష్మ రూపంలో అతని యందు లయిస్తుంది. బ్రహ్మ నిద్రించే నిమిత్తం జరుగుతుంది గనుక, దీనిని నైమిత్తిక ప్రళయం అంటారు. రాత్రి ముగియగానే కల్పాది అయి, మళ్లీ సృష్టి జరుగుతుంది. ఈ విధంగా ఒక బ్రహ్మకాలంలో 36వేలసార్లు సృష్టీ, 36వేలసార్లు నైమిత్తిక ప్రళయమూ జరిగిన తరువాత మహాప్రళయం సంభవిస్తుంది. దీనినే ప్రాకృతిక ప్రళయం అనికూడా అంటారు. ఈ ప్రళయంలో పృథ్వి భస్మమయి పోయి, జలంలో కలిసిపోతుంది. జలం అగ్నిలో ఇంకిపోతుంది.

అగ్ని వాయువుతో లీనమవుతుంది. వాయువు ఆకాశంలో కలసి పోతుంది. ఆకాశం ప్రకృతిలో లయించి పోతుంది, ప్రకృతి పరమేశ్వరుణ్ణి చేరిపోతుంది. ఈ ప్రళయంలో బ్రహ్మదేవునితో సహా, బ్రహ్మ లోకంలోని పుణ్యాత్ములూ, విశ్వంతో సహా, సర్వమూ, ఆ పరమేశ్వరుని యందు లయించి పోతాయి. మళ్లీ పరమేశ్వరుని సంకల్పంతో పునః సృష్టి జరుగుతుంది. బ్రహ్మయొక్క ఆయుర్దాయం, భగవంతునికి ఒక కనురెప్ప పాటు కాలం మాత్రమే. ఈ కాలమానం మానవుని అల్పమేధస్సుకు అవగాహనం అవదు. అయితే, ఒక సత్యం మాత్రం ఊహించవచ్చు : భగవంతుని కనురెప్పపాటుతో, బ్రహ్మకు నూరేళ్లు నిండి, మహాప్రళయమే సంభవిస్తుందని.

## 12. జీవుడు ఎవరు? సంసార బంధం అంటే ఏమిటి?

ఆత్మ, జీవుడు, పురుషుడు, క్షేత్రజ్ఞుడు, జీవి, దేహి, శరీరి, అని, వివిధ సందర్భాలలో చెప్పబడే పదాలన్నీ - జీవాత్మనే సూచిస్తాయి. అయితే ఆ జీవాత్మ అంటే ఏమిటి?

సమస్త విశ్వాన్నీ సృజించిన ఆ ఏకైక పరమేశ్వరుని యొక్క దివ్య చైతన్య శక్తియే జీవరాశుల దేహాలయందు ప్రవేశించి, వాటిని సచేతనం చేసి, ప్రవర్తింప జేస్తుంది. ఒక్కొక్క దేహాన్ని ధరించిన ఒక్కొక్క చైతన్య కిరణమే జీవాత్మ అనబడుతుంది. దేహేంద్రియ మనోబుద్ధుల సముదాయాన్ని ఉపాధి అంటారు. దానినే క్షేత్రమని కూడా అంటారు. వాస్తవానికి పరమాత్మకూ జీవాత్మకూ భేదము లేదు. ఉపాధి గతుడైన పరమాత్ముడే జీవుడు. ఉపాధి ధర్మాల నుండి విడువడిన జీవుడే పరమాత్ముడు. జీవుడు, పరమాత్మయొక్క ఆభాస మాత్రుడు (ప్రతి బింబ స్వరూపుడు). అజ్ఞానం వలన ఉపాధితో తాదాత్మ్యం చెందడంచేత, జీవుడు, ఉపాధి యొక్క సకల కర్మలకూ తానే కర్తననీ, అది పొందే సకల అనుభవాలకూ తానే భోక్తననీ భ్రమను జెంది, శీతోష్ణ సుఖదుఃఖాది అనుభవాలన్నింటికీ, లోనవుతాడు. కాని, ఆత్మ (జీవాత్మ), వాస్తవానికి నిరంజనుడు (దేనిచేతనూ అంటబడని వాడు) అసంగుడు (దేనియందూ తగుల్కొననివాడు), స్వతంత్రుడు (దేని చేతనూ ఆదేశింపబడనివాడు) అవినాశి, అప్రమేయుడు (ఎట్టి ప్రమాణముల చేతనూ తెలుసు కొనబడని వాడు) మార్పు చెందని వాడు. దేహము నశించినన్తూ, నశించనట్టివాడు. శాశ్వతుడైన ఇటువంటి జీవుడు, అవిద్య (మాయామోహం, అజ్ఞానం) చే ఆవరింప బడినవాడై, తన యొక్క పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోలేని

అవివేకియై, ఉపాధియే తాను అనుకొని, రాగద్వేషాది ప్రవృత్తులలో చిక్కుకొని, కర్మల నాచరిస్తూ, కర్మఫలానుభవాలను పొందడానికి, అనేకమైన పుణ్యపాప యోనుల్లో జన్మిస్తుంటాడు. ఒక శరీరాన్ని విడుచునప్పుడు, పూర్వ వాసనలు (సంస్కారాలు, కర్మశేషాలు)తో సహా పోయి, వేరొక శరీరానికి బీజరూపమై ప్రవేశిస్తాడు. ఈ విధంగా, సర్వస్వతంత్రుడైన జీవుడు జనన మరణ దుఃఖ సంసార వలయంలో చిక్కుకొని, బందీ అవుతాడు. దీనినే సంసార బంధమంటారు. నిజానికి, జనన మరణాలే లేని ఆత్మకు (జీవునకు), తెచ్చిపెట్టుకొన్న ఉపాధితోటి తాదాత్మ్యం వలన, సూక్ష్మశరీరాభిమానం అంటుకొని యుండడం చేత, దానితోపాటు కొత్త దేహాన్ని ధరించవలసి వస్తుంది. ఉపాధియే సర్వ సుఖదుఃఖాది అనుభవాలకు ఉత్పత్తిస్థానమూ, నిలయమూ అని గ్రహించి, దానితో నున్న ''సంగము''ను, తాదాత్మ్యము (''అదియే నేను'' అనే భావము)ను, జ్ఞానాభ్యాసాలచే తొలగించుకొన్న జీవుడు సంసార బంధం నుండి ముక్తుడు కాగలడు.

## 13. శ్రీకృష్ణుడు భగవంతుడా ?

భగవంతుడంటే ఎవరు? నిరాకార నిర్గుణ పరమాత్మ, సగుణుడై మానవులు, మొదలైన జీవరాశులను అనుగ్రహించడానికి రూపాన్ని ధరిస్తాడు. సకల ఐశ్వర్యసంపదా, సర్వశక్తి మంతత్వము, ఈశ్వరత్వము, సర్వ వ్యాపకత్వము, సర్వజ్ఞత, దివ్యసౌందర్య శోభ, యశస్సు, అనాసక్తత, అసంగత్వము, కరుణ, ఈ ఐశ్వర్య లక్షణాలన్నీ మూర్తీభవించియున్న ఏకైక చైతన్య స్వరూపుడే, భగవంతుడు. కృష్ణస్తు భగవాన్ స్వయం- శ్రీకృష్ణుడే సాక్షాత్తు భగవంతుడు, అన్నారు. అతడు సర్వాకర్షకుడు, దేవ, దానవ, మానవ, జంతు, జీవరాశులన్నీ ఆయన సమ్మోహన శక్తికి ఆకర్షితులవుతాయి. భగవద్గీతను ఆలాపించినది ''భగవతా నారాయణేన స్వయం'' సాక్షాత్తు

---

''మమై వాంశో జీవలోకే, జీవ భూతః సనాతనః ।
మనః షష్ఠా నీంద్రియాణి, ప్రకృతిస్థాని కర్షతి॥ (15-7)

నాయొక్క సనాతనమైన అంశమే. జీవలోకమందు జీవుడై, ఆరు ఇంద్రియాలను ఆకర్షించుకొంటుంది ''శరీరం యదవాప్నోతి, యచ్చాప్యుత్క్రా మతీశ్వరః, గృహీత్వైతాని సంయాతి, వాయుర్ గంధానివాశయాత్ (15-8) జీవుడు దేహాన్ని విడిచి వెళ్లునప్పుడు పువ్వులనుండి వాసనను తీసుకొనిపోయే వాయువువలె ఈ ఇంద్రియాలను తీసుకెళ్తాడు.

శ్రీమన్నారాయణుడే అన్నారు. భగవద్గీతను నారాయణుడైన శ్రీకృష్ణుడు, నరుడైన అర్జునునకు ఉపదేశించాడు. అందుచేతనే, శ్రీభగవాన్ ఉవాచ అని అన్నారు గాని, శ్రీకృష్ణ ఉవాచ అని అనలేదు.

అయితే, శ్రీకృష్ణుని ప్రవర్తన సామాన్య మానవుని ప్రవర్తన వలెనే ఉండేది ఎందుకు-అనిపించవచ్చు. ఆయన మానవ దేహధారి అయి యుండడంచేత, గొల్లి వారింట పెరిగి, అల్లరి శిశువుగా, కొంటె బాలునిగ, పశువుల కాపరిగా, విచ్చల విడిగా సంచరించే యువకునిగా, బహుభార్యా గృహస్థునిగా, రాజకీయ వ్యూహ చతురునిగా, అతి సామాన్య మానవునిగా, లోకులకు కనిపించడం, ఆయన యొక్క మాయా ప్రభావం అని గుర్తించాలి.

దివ్య వైభవాలన్నీ మూర్తీభవించియున్న ఆయన యొక్క జననమే ఒక అద్భుతమైన అపూర్వమైననేపథ్యంలో జరిగింది. అప్పటినుండీ, అవతారం చాలించే వరకూ, ఆయన యొక్క ప్రతీ చేష్టా, చేసిన ప్రతీకార్యమూ, అనన్య సాధ్యమైన, ఆయన యొక్క దివ్యత్వాన్నే నిరూపిస్తుంది. చెరసాలలో పుట్టానే తనయొక్క దివ్యరూపాన్ని తల్లి దండ్రులైన దేవకీ వసుదేవులకు చూపాడు. నందగోకులానికి తీసుకొని పోబడి, యశోదమ్మ పుత్రునిగా వెలసిన కొద్దిరోజులకే, చంపవచ్చిన పూతన అనే రాక్షసి యొక్క ప్రాణాలను పీల్చివేశాడు. పుట్టిన 89వ రోజునే, శకటాసురుడు అనే రాక్షసుణ్ణి కాళ్లతో తన్ని కూల్చివేశాడు. ఒక సంవత్సరం వయస్సులో, సుడిగాలి రూపంలో వచ్చి, తన్ను ఎగురవేసుకు పోతున్న తృణావర్తుడనే రాక్షసుణ్ణి పీకనొక్కి, పడవేసి చంపాడు. యశోదమ్మకు, తన నోటియందే చతుర్దశ భువనాల తోనున్న తన విశ్వరూపాన్ని చూపించాడు. మూడేళ్ల వయస్సులో, కోపం వచ్చిన తల్లి, తనను రోటికి కట్టి బంధించగా, ఆ రోటినే రెండు మహావృక్షాల మధ్యనుండి ఈడ్చుకొని పోగా, అవి కూలిపోయి, వాటి నుండి శాప విమోచనులైన ఇద్దరు యక్షులు వచ్చి, వారు శిశువుగానున్న ఆ దేవ దేవుని స్తుతించి వెళ్లిపోయారు. బృందావనంలో, వత్సాసురునీ, బకాసురునీ, అఘాసురునీ, అయిదేళ్లయినా నిండని ఆ దివ్య బాలుడు హతమార్చాడు. శ్రీకృష్ణుని దివ్యమహిమలను స్వయంగా పరీక్షించి ఆనందించాలనే అభిలాషతో ఒకనాడు బ్రహ్మదేవుడు గోపబాలురనూ,గోవత్సాలనూ, ఒక ఏడాది కాలం దాచి ఉంచగా, ఐదేళ్ల బాలుడైన శ్రీకృష్ణుడు తానే అన్ని దూడలు గానూ, అందరు గొల్లపిల్లలుగానూ రూపొంది, తల్లులకూ ఇతరులకూ, ఎవ్వరికీ, ఏమీ

తెలియకుండా, బ్రహ్మదేవుని కోరికతీర్చి, అహంకారం అణిచాడు. ఆరేళ్ల వయస్సులో, కాళియుడనే సర్పం, కాళింది మడుగులోని నీటిని విషమయం చేసి, మనుష్య, పశు, పక్షి, జలచరాలకు హాని కలిగిస్తుండడంచేత, ఆ మహాసర్పం యొక్క 101 పడగల పైకెక్కి, నృత్యం చేసి, దాని మదం అణచి, దానిని సముద్ర గర్భంలో ఉండమని తరిమివేశాడు. గొల్లలు సంచరిస్తుండే అరణ్యంలో కారుచిచ్చు చెలరేగగా, దానిని తన నోటిలోనికి పీల్చుకొని, మింగివేశాడు. ఏఢు సంవత్సరాల వయస్సప్పుడు, గోవర్ధన గిరిని ఒక్క చేత్తో ఛత్రంలాగ ఎత్తి పట్టుకొని, బృందావనంలోని జీవులందరినీ, వారి ఆస్తులతోపాటు కొండక్రిందను సురక్షితంగా నుంచి ఏడు ఆహోరాత్రాలు ఏక ధాటిగా కుంభవృష్టిని కురిపించి, ఏమీ చేయలేక విరమించుకొన్న ఇంద్రుని అహంకారం అణచాడు. వరుణలోకంపోయి, అసురులచే అపహరింపబడిన నందుని రక్షించి, తీసుకొని వచ్చాడు. గోపికలుగా జన్మించిన ఋషుల చిరకాల వాంఛలను తీర్చడానికి, ఎందరు గోపికలుంటే అందరు కృష్ణులుగా వెలసి, వారితో రాసనృత్యం చేసి అనుగ్రహించాడు ఆ ఏడేళ్ల బాలకృష్ణుడు. దేవతలుకూడా కన్నుల పండువుగా తిలకించి, పులకించి, ఆనందించిన అలాంటి రాసక్రీడ ఇంకెప్పుడూ జరుగలేదు. యమునా నదిలో స్నానం చేస్తున్న అక్రూరునకు శేషశాయి అయిన మహావిష్ణువుగా దర్శనమిచ్చాడు. శంఖ చూడుడు, వృషభాసురుడు, కేశి, వ్యోమాసురుడు, మొదలైన దుష్టులను పది ఏండ్ల వయస్సులోనే అంతం చేశాడు.

మేనమామ అయిన కంసుడు, కృష్ణుణ్ణి చంపించ దలచి, ధనుర్యాగపు మిషతో కృష్ణ బలరాములను మధురకు రప్పించగా, వెళ్లిన శ్రీకృష్ణుడు, కువలయా పీడమనే భయంకర మత్తగజాన్నీ, చాణూరుడనే భీకరమైన రాక్షస మల్లుణ్ణీ, చివరకు ప్రచండ పరాక్రమశాలియైన కంసుణ్ణి కూడా నేలకూల్చాడు, తన 12వ ఏటనే. చనిపోయిన గురుపుత్రుణ్ణి, యముని వద్దనుండి తీసుకొని వచ్చి, తన గురువైన సాందీపునకు గురుదక్షిణగా ఇచ్చాడు. జరాసంధునీ కాలయవనునీ, ఉపాయంతో చంపించాడు.

పెద్దవాడై వివాహాలు చేసుకొన్న తరువాత, నరకాసురుని వధించి వానిచే చెరపట్ట బడిన 16 వేలమంది రాజకన్యలను విడిపించాడు. తమను తమ తలిదండ్రులు స్వీకరింపరు గనుక, శ్రీకృష్ణుడే తమను కాపాడాలనీ, ఆ రాజకన్యలు ప్రార్థింపగా, వారందరినీ తానే పెండ్లాడి, ఒక్కొక్కరికీ ఒక్కొక్క కృష్ణునిగా, 16వేలమంది కృష్ణులై, అందరినీ సమానంగా ఆదరించాడు. బాణాసురుని వెయ్యి చేతులు ఖండించాడు.

నృగమహారాజు శాపవిమోచన చేశాడు. అహంకార బల గర్విష్ఠి అయిన తానే వాసుదేవుడను, వేరొక వాసుదేవుడు ఉండరాదు. అని ప్రగల్భాలు పలికిన పౌండ్రక వాసుదేవడనే రాజును యుద్ధంలో అంతంచేశాడు. శిశుపాల, సాల్వ, దంతవక్త్రులనే దుష్టులను హతమార్చాడు. మృతుడైన పదిమంది బ్రాహ్మణ పుత్రులను ముల్లోకాలూ గాలించి, చివరకు శ్రీ మహావిష్ణువు వద్ద నుండి, వారిని తోడ్కొని వచ్చి తల్లిదండ్రులకు ఒప్ప జెప్పాడు.

భూభారాన్ని తొలగించే నిమిత్తమై అవతరించిన శ్రీకృష్ణుడు, కురుక్షేత్రాది అనేక యుద్ధాలు జరుగగా, ఇంకా మిగిలియున్న తన పుత్ర పౌత్రాది బంధు వర్గాలతో నిండియున్న లక్షలాది యాదవ వంశీయులను కూడా, ఎలాంటి మోహ మమకారాలూ లేకుండా, నశింపజేశాడు. తన ప్రియ భృత్యుడైన ఉద్ధవునకు ఆత్మజ్ఞానోపదేశం చేసి అవతారం చాలించాడు.

ఇటువంటి మహత్తర మానవాతీత కార్యాలు చేయగలిగిన పురుషోత్తముడు సాక్షాత్తు భగవంతుడే అనడానికి సంకోచించే వారు ఇంకా భ్రమలోనే ఉన్నట్టి వారు అనుకోవాలి.

భగవద్గీతలో శ్రీ కృష్ణుడే తన గురించి ఇలా చెప్పాడు :

''అర్జునా! నేను పుట్టుక లేనివాడను. నాశ రహితుడను. సమస్త ప్రాణులకు ఈశ్వరుడను. అయినప్పటికీ, ధర్మము క్షీణించి, అధర్మము అభివృద్ధి చెంది నప్పుడు దుష్టులను శిక్షించి, సాధు సజ్జనులను రక్షించి, ధర్మాన్ని స్థాపింప జేయడానికి నా మాయాశక్తిచే నన్నునేను సృజించుకొని అవతరిస్తుంటాను (4-68)
''నేను ఈ సమస్త జగత్తుకూ సృష్టిస్థితిలయకర్తను. నాకంటె వేరైనది ఏదీ లేదు (7-6). నన్ను గూర్చి ఎవ్వరునూ తెలుసుకోలేరు(7-26) ''నేనే సమస్త భూతములకు ఉత్పత్తి స్థానమును, బీజమును ఉంచు తండ్రిని (14-3,4)
''సర్వ ప్రాణుల హృదయ గుహయందుండు అంతరాత్మను నేను (15-15)
''నా యొక్క దివ్య విభూతులకు అంతము లేదు. ఈ వ్యక్త మైయున్న విశ్వమంతా నాయొక్క ఒకానొక అంశ మాత్రమే. (10-40) ఈ విధంగా సర్వమూ వాసుదేవ మయమే అని తెలుసుకొన్న జ్ఞాని మోక్షాన్ని పొందగలడు''. అని భగవానుడైన శ్రీకృష్ణుడు చెప్పాడు. తానే పరమేశ్వరుడనని నిరూపిస్తూ, తన విశ్వరూపాన్ని అర్జునునకు చూపిస్తాడు. అటువంటి అద్భుత రూపాన్ని అంతవరకూ, ఇంతవరకూ,

ఒక్క అర్జునుడే చూడగలిగాడు. విభ్రాంతుడైన అర్జునుడు తన విస్మయాన్ని ఈ విధంగా వ్యక్తపరుస్తాడు. '' ఓ దేవ దేవా! భూమి, ఆకాశమూ, అంతా నీచే నిండియున్నది. నీ యొక్క మొదలూ తుదీ తెలియకున్నది. నీ యందే బ్రహ్మాది దేవతలూ, ఋషులూ సిద్ధులూ, రుద్రులూ, ఆదిత్యులూ, అసురులూ కనిపిస్తున్నారు. ముల్లోకాల్లో ఎటు చూచినా నీవే వ్యాపించియున్నావు. సూర్య చంద్రులు నీ నేత్రాలుగా వెలుగుతున్నారు ఆశ్చర్యకరమైన నీ అద్భుత రూపం చూస్తుంటే భయం కలుగుతుంది. నీకు కోటి కోటి నమస్కారాలు. నీ యొక్క సౌమ్య రూపాన్ని మళ్లీ చూపించు ప్రభో'' అని ప్రార్థిస్తాడు (11-17,18)

శ్రీకృష్ణుడు ఇంకా, ఇలాగ చెప్తాడు: '' అర్జునా! నాకు పర, అపర అనబడు రెండు ప్రకృతులున్నవి. వీటి యొక్క కలయిక చేతనే సృష్టి సంభవిస్తుంది (7:47), అవ్యక్తమైన ఈ ప్రకృతి కంటె నేను పరుడను అనాది అయినవాడను. భూతజాలములు నశించినా, నశించని వాడను. నేనే పిపీలికాది బ్రహ్మపర్యంతమూ, సర్వులకూ పరమగతిని. నన్ను చేరిన జీవికి మరిజన్మ ఉండదు (8:20,21). ఈ జగత్తుకు నేనే నాశరహితమైన బీజప్రదాతనూ, ఉత్పత్తి లయస్థానమునూ, నిధినిక్షేపమునూ, ధరించు వాడనూ, ప్రభువునూ, సర్వసాక్షియూ, అయియున్నాను. సూర్య చంద్రులకూ, పంచ భూతాలకూ, అందలి జీవరాశులకూ నేనే చైతన్య శక్తి నిచ్చి ప్రవర్తింప జేస్తున్నాను (9:18,19) ఓంకారమూ, వేదాలూ, తపశ్శక్తి, త్రిగుణాలూ, భూత రాశుల యందలి చైతన్యమూ, జ్ఞానమూ, శక్తీ, నా నుండియే వెలువడ్డాయి. (7:8,9) ఉత్పత్తి నాశములు లేని ఆది పురుషుడనైన నా గురించి, నా మాయాప్రభావం చేత, బ్రహ్మాది దేవతలు కూడా ఎరుగరు (10:1,2). నా మాయను అధిగమించడానికి ఎవ్వరికీ శక్యం కాదు. (7:13,14).

శ్రీ కృష్ణుడు దేవాది దేవుడైన భగవంతుడు. భగవద్గీత, భావితరాల వారిని తరింపజేయడానికి ఆయన ముఖతః వెలువడిన సందేశామృత తరంగిణి.

## 14. మానవ జీవిత లక్ష్యం ఏమిటి?

ప్రతీ మనిషీ, దుఃఖ నివృత్తి, సుఖప్రాప్తి గురించే అనుకోకుండానే, అహరహమూ, ప్రయత్నిస్తుంటాడు. లేని సుఖం ఎలాగ వస్తుంది, ఉన్నది ఎలాగ వృద్ధి చెందుతుంది అనీ, ఉన్నదుఃఖం ఎలాగ పోతుంది, లేదా ఎలాగ తగ్గుతుంది, లేనిది ఎలాగ రాకుండా ఉంటుంది అనీ, ఎల్లప్పుడూ యాతన పడ్తుంటాడు.

జ్ఞానేంద్రియాలైన- నాలుక, ముక్కు, చెవులు, కండ్లు, చర్మములకూ, వాటి అధినేత అయిన మనస్సుకూ, ప్రియమైన- రుచులు, వాసనలు, శబ్దాలు, దృశ్యాలు, స్పర్శలూ- లభిస్తుంటే సుఖమూ, అవి తృప్తి తీరా లభించకపోయినా, లేదా అప్రియమైనట్టివి ప్రాప్తించినా, దుఃఖమూ, కలుగుతాయి. ఈ సుఖదుఃఖాలు ఒకదానిని ఒకటి తరుముకొంటూ మనిషిని ఆవేశిస్తాయి. ఏదీ స్థిరంగా ఎక్కువకాలం ఉండదు. ఈ తాత్కాలికమైన సుఖాలవేటలో మానవుడు తన అమూల్యమైన జీవితాన్నంతా వెచ్చించి వేస్తాడు.

సృష్టిలో నున్న 84 లక్షల జీవజాతులలో మానవ జాతి అతి ఉత్కృష్టమైనట్టిది. అనేక లక్షల జన్మల అనంతరం మానవ జన్మకు చేరుకొంటాడు. అందుకే జంతూనాం నరజన్మ దుర్లభం అని అన్నారు. ఇంక ఏ జాతికీ లేనట్టి బుద్ధికుశలత మానవ జాతికి మాత్రమే ఉన్నది. దాని చేతనే మానవుడు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని సంపాదించి మోక్షాన్ని పొందగలడు. స్వర్గలోకవాసులు కూడా, తమ పుణ్యం క్షీణించగానే మానవులై జన్మించాలి. మానవ దేహమే మోక్షప్రాప్తి సాధనకు సరియైన క్షేత్రము. ఇంతటి మహత్తరమూ, దుర్లభమూ అయినట్టి మానవ జన్మను, మానవుడు అజ్ఞానంచేత, అపవ్యయం చేసుకొంటున్నాడు. తీర్చుతున్న కొద్దీ చెలరేగే కోర్కెల కారుచిచ్చును క్షణికమైన ఇంద్రియ సుఖాలతో తృప్తి పరచాలనే కాంక్షతో, నానావిధాలైన కోరికలతో కూడినట్టి (కామ్యకర్మలు) వ్యాపకాల్లో తగుల్కొని, జీవితం అంతా యాతనామయం చేసుకొని, అమూల్యమైన తన మనశ్శాంతిని కోల్పోతున్నాడు, వ్యాధిగ్రస్తుడవుతున్నాడు. సుఖప్రాప్తి, దుఖనివృత్తిని సాధించడానికీ, మనోవాంఛా ఫలసిద్ధికీ, అనేక రకాలైన పుణ్యకార్యాలూ, నోములూ వ్రతాలూ, యజ్ఞ యాగాదిక్రతువులూ, తీర్థయాత్రలూ, పూజలు, భజనలూ, దేవతార్చనలూ, జపతపాది సాధనలూ, అనేక చేస్తుంటాడు, దేనివలననైనా తన కోరికలు తీరకుండా ఉంటాయా, అని. కొన్ని సిద్ధించవచ్చు. అయినా, కోరికలకు అంతం ఉండదు గనుక, ఈ వేట, జీవితం అంతా కొనసాగుతూనే ఉంటుంది. అయితే, అమూల్యమైన జీవితాన్ని వ్యర్థపుచ్చి, సంపాదింపబడిన వాటి విలువేమిటి? అవి ఎన్నాళ్లుంటాయి?

కంటికి కనిపించేదంతా నశించునట్టిదే (యత్ దృశ్యం, తత్నశ్యం) అన్నారు. వ్యక్తులు, ఆస్తులు, ఇళ్లూ, కట్టడాలూ, నదులూ, పర్వతాలతో సహా ప్రతీ వస్తువూ,

ఎప్పుడో ఒకప్పుడు కాలగర్భంలో కలిసిపోయేటట్టివే. అట్టి వస్తువులు ఇవ్వగలిగే సంతోషం కూడా తాత్కాలిక మైనదే. అయితే శాశ్వతమైన ఆనందం దేనిలో ఉంటుంది- అని ఉదయించే ప్రశ్నకు, మన పూర్వులైన మహాఋషులు అన్వేషించి, నిర్ణయించారు. దానితో పాటు-నేనెవరిని? ఎక్కడి నుండి వచ్చాను, నా గమ్యం ఏమిటి? నా వలెనే, ఆకలి, నిద్ర, భయము, సంభోగేచ్ఛ, లాంటి దేహబాధలను తీర్చుకొనే జంతువులకూ, బుద్ధి జీవినైన నాకూ, తేడా ఏమిటి? సూర్యచంద్రులనూ, భూమి నీరు అగ్నిలాంటి పంచ భూతాలనూ, మానవుడు, జంతువులు, పక్షులు, వృక్షాలు లాంటి జీవరాశులను ఎవరు సృష్టించి, పోషించి, క్రమబద్ధంగా పాలించి, లయింప జేస్తున్నారు? మొదలైన అనేక విషయాల గురించి వేద శాస్త్రాలను శోధించి గ్రహించారు.

ఈ విశ్వ సృష్టి అంతటికీ, మూలకారణమైన ఏదో ఒక మహత్తర శక్తి ఒకటి ఉన్నది. అదే, వ్యక్తరూపంలో పరమేశ్వరునిగా వెలసి, సమస్తమూ నిర్వహిస్తూ ఉంది. ఆ పరమాత్మ యొక్క అంశయే, జీవునిగా, దేహధారియై, అనేకమైన జీవజాతులలో జన్మించిన అనంతరం, మానవ జాతిలో జన్మిస్తాడు. తన యొక్క బుద్ధి కుశలతచే, ఆత్మ జ్ఞానాన్ని పొంది, బ్రహ్మానంద నిలయమూ, పరంధామమూ అయిన ఆ సత్ చిత్ ఆనంద పరమాత్మను తెలుసుకొని, తన నిజ తత్త్వమైన ఆ పరమాత్మతో ఏకమవుతాడు. దేహాన్ని ధరించిన జీవాత్మ, ఉపాధితోనున్న బంధం నుండి విముక్తిని చెంది, పరమాత్మయందు లీనమవడమే ప్రతీ జీవియొక్క జీవితలక్ష్యము. అంతవరకూ, జీవుడు ఈ దేహమే నేను. అనే మిథ్యా తాదాత్మ్యాన్ని తెచ్చిపెట్టుకొని, దేహానికి సంభవించే సకల సుఖ దుఃఖాలూ, తనవిగానే భావించి, అనుభవిస్తూ కర్మలుచేస్తూ, సంసారవలయంలో తిరుగుతుంటాడు. ఇంద్రియ భోగాలు క్షణికమైనవని తెలుసుకొని, శాశ్వతమైన ఆత్మానందం గురించి పాటుపడి, ఆత్మసాక్షాత్కారాన్ని పొందడమే జీవిత లక్ష్యము. అదియే బ్రహ్మానంద దాయకము.

## 15. కర్మసిద్ధాంతం అంటే ఏమిటి?

ప్రతీ జీవి, శరీరయాత్ర గడవడానికైనా, ఏదో ఒక కర్మ చేస్తూ ఉండాలి. ప్రతీ కర్మకూ ఏదో ఒక ఫలం వస్తుంది. ఆ కర్మ ఫలాన్ని, కర్త అనుభవించాలి. అనుభవించితేనే, ఆ కర్మ నశిస్తుంది. అనుభవింపబడని కర్మలు (సంచిత కర్మలు) ముందు జన్మలలోనైనా అనుభవానికి వస్తాయి. అవి అన్నీ ఒకే సారిగా కాకుండా,

అవకాశమూ, అవసరమూ, సందర్భమూ, కుదిరినప్పుడు, కొన్ని కొన్ని కర్మల అనుభవం ప్రారంభమవుతుంది. ఆవిధంగా ప్రారంభించబడిన వాటిని, ప్రారబ్ధ కర్మలంటారు. ఈ ప్రారబ్ధకర్మల అనుభవం జరుగుతుండగా, కొన్ని కొత్త కర్మలూ, వాటి ఫలానుభవాలూ కూడా జరుగుతుంటాయి, వీటిని క్రియమాణాలంటారు. వీటిలోని అనుభవింపబడని కర్మలు సంచిత కర్మ సముదాయంలో చేరుతాయి. ఈవిధంగా కర్మచక్రం తిరుగుతునే ఉండి జీవుణ్ణి బంధించి ఉంచుతుంది. అనుభవింప వలసియున్న కర్మలను అనారబ్ధ కర్మలంటారు.

పూర్వజన్మల నుండి వచ్చిన కర్మలను పూర్వసంస్కారాలూ లేదా పూర్వ వాసనలూ అంటారు. ఇవి, జీవి యొక్క అంతః కరణంలో బీజరూపంలో నిక్షిప్తమై యుండి, సూక్ష్మదేహంతోపాటు, జీవి ప్రవేశించే కొత్త దేహంలో ప్రవేశించి, అక్కడ మనస్సును, పూర్వసంస్కారానుగుణంగా ప్రవర్తింపజేసి, కర్మలు చేయించడానికి ప్రేరేపిస్తాయి. జీవుని యొక్క భావిజన్మలు కూడా ఈ పూర్వవాసనలకు అనుగుణంగానే నిర్ణయింప బడుతాయి.

వర్తమాన దశ, పూర్వసంస్కారలచే నియమింపబడి యుండడంచేత, భావిజన్మలు, వర్తమాన కర్మ సంస్కారాలచేత నిర్దేశింప బడుతాయి అనే సత్యం మనకు తెలియవస్తుంది. పూర్వం జరిగిపోయిన కర్మలపై మనకు ఏవిధమైన అదుపూ ఉండదు గనుక, భవిష్యత్తును చక్కబెట్టుకోవాలంటే వర్తమానాన్నే మనం తీర్చిదిద్దుకోవాలి. రేపుచేయబోయే పనిని గురించి నేడు అనుకుంటాం. ఒక నెల ముందుగా, రైలుప్రయాణానికి రిజర్వేషన్ చేసుకుంటాం. మూడు సంవత్సరాల ముందుగానే పెండ్లి ప్రయాత్నాలు మొదలు పెడ్తాం. ఎప్పుడో ఇరవై ఏళ్లకు రిటైరు అయితే ఉండడానికి ఇల్లు కావాలని, ఇప్పుడే అప్పుతీసుకొని ఇల్లు కట్టే ప్రయత్నం ప్రారంభిస్తాం. కాని , ఈ అనంత యాత్రలో, మనం చేరబోయే, తరువాతి మజిలీ గురించి అసలే ఆలోచించం. ఎందుకంటే జీవితం అంటే మాతృగర్భంలో మొదలు అయి, మరుభూమిలో ముగిసిపోయే ఒక చిన్న కథ మాత్రమే, ఆ తరువాత ఎప్పుడో, ఏం జరుగుతుందో ఎవరికి తెలుసులే అని అనుకుంటాం గనుక. కాని వేదాంత సారమైన భగవద్గీతలో చెప్పినట్లు, అంతమయ్యేది దేహమే గాని, దేహి అయిన ఆత్మకాదు;

జీవుడు (దేహి, ఆత్మ) ఒక శరీరాన్ని విడిచి, తన పూర్వసంస్కారాలకు సరిపడే వేరొక శరీరాన్ని ధరిస్తాడు. అందుచేత మనకు ఇప్పటి కంటె ఉత్తమ జన్మ ప్రాప్తించాలంటే ఇప్పుడే ఉత్తమ సంస్కారాలను పెంపొందించే ఉత్తమ కర్మలను చేపట్టాలి. జన్మరాహిత్యమే కావాలనుకుంటే, వాసనాక్షయం కలిగించే సాధనలను చేపట్టాలి. అలాగ చెయ్యకుండా, ఇంద్రియాలను తృప్తి పరచడమే ధ్యేయం అనుకొని ప్రవర్తిస్తుంటే దానికి అనుగుణమైన జన్మలే సంభవిస్తాయి- పశువాంఛలు తీర్చేటట్టివీ, ఆహారనిద్రాసంభోగాలే సర్వస్వం అనిపించేటట్టివీ అయిన నీచ జన్మలూ, జంతుజన్మలూను. అక్కడి నుండీ మళ్లీ ఉత్తమ జన్మలకూ, జన్మరాహిత్య స్థాయికీ, ఎదగాలంటే, ఇంకా అనేక వేల జన్మలెత్తి, సత్కార్మలు చేస్తుంటే గాని, సాధ్యపడదు.

ఈ జన్మలో పోగుచేసుకొనబడే ధనకనక గృహవస్తు వాహనాది సంపదలేవీ మనతో ముందు జన్మలకు రావు. ఉత్తమ, నీచసంస్కారాలే జీవిని అంటుకొని, పోయి, నూతన శరీరంలో సుఖదుఃఖాది అనుభవాలను కలిగిస్తాయి. ఇప్పుడు మనం అనుభవిస్తున్న సుఖదుఃఖాలకు మూలకారణం మనం తెచ్చుకొన్న పూర్వ పుణ్య పాపకర్మల ఫలాలే అని తెలుసుకోకుండా, మంచి ఏదైనా జరిగితే, అది, మన ప్రతిభ అనీ, చెడు జరిగితే, ఇతరుల కుట్రఅనీ, లేదా నిర్దయుడైన దేవుని దుశ్చర్య అనీ భావిస్తాము. నిత్యజీవితంలో మనం చూస్తుండే, రోగగ్రస్తులూ, ఋణగ్రస్తులూ, హీనులు, దరిద్రులూ, చోరులూ, హంతకులు, సకల ఐశ్వర్యాలతోనూ, అధికారాలతోనూ భోగభాగ్యాలతోనూ, తులతూగుతుండే కొందరు ''అదృష్టవంతులూ'', ఉండడానికి (మనం లౌకిక పరంగా ఎన్ని కారణాలు చెప్పుకున్నా), అసలు కారణం, ఆ జీవులు ఆర్జించి, తెచ్చుకొన్న పూర్వసంస్కారాలే. ఎవరు చేసిన పుణ్య పాపకర్మ ఫలాలను, వారే ఎప్పుడో ఒకప్పుడు అనుభవించక తప్పదు. కొన్ని పరిస్థితుల్లో పూర్వుల యొక్క కర్మ ఫలాలను తరువాతి తరాలవారు అనుభవించవచ్చు, అలాగే మనం చేసే సత్కార్యాల పుణ్యంచే, మన పూర్వులకు సద్గతి కలుగవచ్చు. ప్రారబ్ధకర్మలను అనుభవించి తీరాలి. కాని, అనారబ్ధమైన సంచిత కర్మలను, జ్ఞానసాధనలచేత, దైవానుగ్రహంచేత, తగించుకోవడం, పోగొట్టుకోవడం

సాధ్య పడుతుంది. అందుచేత, ఉత్తమ జన్మలు కావాలంటే ఉత్తమ సంస్కారాలను సంపాదించాలి, జ్ఞాన సాధన ద్వారా వాసనాక్షయం సాధించాలి.

పునర్జన్మ సిద్ధాంతాన్నీ, కర్మ సిద్ధాంతాన్నీ సనాతన ధర్మంలో చెప్పబడినంత క్షుణ్ణంగా, స్పష్టంగా, ఇంక ఏ ఇతర మతాల్లోనూ చెప్పబడలేదు.

## 16 గీతలలో చెప్పబడిన ముఖ్యమైన విషయాలేంటి?

మాయా మోహితుడైన మానవుడు పూర్ణ ప్రజ్ఞుడై మాయాధీశుడైన మహేశ్వరుని జేరడానికి అనేక సాధన సూత్రాలను భగవానుడు భగవద్గీతలో సూచించాడు. తీవ్రమైన ధ్యానావస్థలోనే తప్ప అంతుపట్టని నిగూఢమైన వేదాంత రహస్యాలను అల్పమేధస్కులకు కూడ అర్థమయ్యేటట్టు భగవానుడు బోధించాడు.

భగవానుడు చెప్పిన ప్రతీ వాక్యూ, ప్రతీవిషయమూ, అమృత తుల్యమే. వాటిలో ఏదీ ''తక్కువ ప్రాముఖ్యత కలవి'' అని, విడిచి పెట్ట వీలు కానట్టివే, బంధు వ్యామోహంచే శోక పీడితుడైన అర్జునుణ్ణి నిమిత్తంగా పెట్టుకొని, మానవాళిని తరింప జెయ్యడానికి, ఉపనిషత్తుల సారాన్నంతా సంగ్రహించి, ఆరగింపజేశాడు. వాటిలో కొన్ని ఇవి :

---

''నమాం దుష్కృతి నోమూఢాః ప్రపద్యంతే నరాధమాః ।
మాయ యాऽపహృత జ్ఞానా, ఆసురం భావ మాశ్రితాః ॥'' (7-15)

మూఢులు. నరాధములు, దుష్కర్మలు చేయువారు నన్నాశ్రయించక అసుర స్వభావం పొందుతారు

'' అవజానంతి మాం మూఢా, మానుషీంతను మశ్రితం ।
పరంభావ మజానంతో, మమభూత మహేశ్వరం ॥ (9-11)
మోఘా శామోఘు కర్మాణో, మోఘు జ్ఞానా విచేతసః ।
రాక్షసీ మాసురీంచైవ, ప్రకృతిం మోహినీం శ్రితాః (9-12)

నా యొక్క పరతత్త్వాన్ని ఎరుగని మూఢులు నన్ను అలక్ష్యం చేసి వ్యర్థపు ఆశలతో, వ్యర్థకర్మలు చేస్తూ అవివేకులై రాక్షస, అసుర స్వభావాలకు అలవాటుపడి నశిస్తున్నారు.

**16.1.** **ఆత్మకు జనన మరణాలు లేవు. మరణించేది దేహము మాత్రమే.**
సర్వ ప్రాణులకూ అత్యంత భయంకరమైనది మృత్యుభయం. ఆమృత్యువు దేనికి సంభవిస్తుందో తెలుసుకొంటే ఇక భయానికి తావు ఉండదు. పంచభూతాలతో ఏర్పడి, ఎముకలు, మాంసము, చర్మము మొదలైన వాటితో రూపొందిన దాన్ని స్థూలశరీరం అంటారు. ప్రాణేంద్రియ మనోబుద్ధి చిత్తాహంకారాలతో కూడి యున్న దాన్ని సూక్ష్మదేహం అంటారు ( లింగ శరీరం అని కూడా అంటారు). ఈ స్థూల సూక్ష్మ శరీరాలను చైతన్యవంతం చేసి ప్రవర్తింపజేసే శక్తిని ఆత్మ అని జీవాత్మ అని, జీవుడనీ అంటారు. ఇది పరమాత్మ యొక్క అంశ పంచభూతమయమైన స్థూల శరీరం, కాల, కర్మ, వశాన్న శిథిలమై పతనమౌతుంది. మళ్లీ పంచభూతాల్లో కలిసిపోతుంది. దానినే మరణమంటారు. స్థూలదేహం జన్మించిన తరువాత అనేక మార్పులకు లోనవుతుంది. శిశుదేహం బాల్యదేహంగాను, బాల్యదేహం కుమారదేహంగానూ, కౌమార్యం యౌవన దేహంగానూ, యౌవనం వృద్ధదేహంగానూ మారినట్లే, దేహాంతర స్థితి కూడా, తరువాతి పరిణామమే. అప్పుడు జీవుడు, సూక్ష్మ (లింగ) శరీరాన్ని తీసుకొని పోయి అనుకూలమైన మాతృగర్భంలో ప్రవేశించి నూతనదేహాన్ని ధరిస్తాడు. అలాగే, కొన్నాళ్లకు అవసరం తీరిన దుస్తులను విడిచి వేరొక దుస్తులను ధరించినట్లు, ఆ దేహాన్ని కూడా విడిచి, వేరొక దేహాన్నీ, దాని తరువాత ఇంకొక దేహాన్నీ ధరిస్తూ ఉంటాడు. ఈవిధంగా, అనేక జన్మపరంపరల అనంతరం ఆత్మజ్ఞానం కలిగి, పూర్వసంస్కారాలు నశించగా లింగ శరీరం, జీవుని విడిచిపెట్టి, సమిష్ఠి లింగ శరీరంలో లీనమయి పోతుంది. సూక్ష్మశరీర బంధం నుండి విముక్తి చెందిన జీవాత్మ పరమాత్మతో ఏకమవుతుంది. ఆత్మను ఆవరించియున్న స్థూల శరీరం, కొద్ది సంవత్సరాల్లోనూ, సూక్ష్మ శరీరం, కొద్ది జన్మలలోనూ, ప్రకృతిలో కలిసిపోగా, ఆత్మ పరమాత్మలో కలిసిపోతుంది. స్థూల సూక్ష్మ శరీరాలు రెండూ నశించేటట్టివి గాని, ఆత్మ మాత్రము అవినాశి, అని తెలుసుకొన్న వ్యక్తి, జడమైన స్థూల శరీరం రాలిపోతే, దేని గురించి భయపడాలి, శోకించాలి?

**16.2.** మరణ కాలమున, మానవుడు, ఏభావాన్ని చింతిస్తూ దేహాన్ని విడుస్తాడో, ఆ భావసంబంధమైన రూపాన్నే పొందుతాడు. అందుచేత ఓ పార్థా! ఎల్లప్పుడూ నన్నే స్మరిస్తూ, నీ ధర్మాలన్నీ నెరవేర్చుతూ ఉండు. ఈ విధంగా ఎవడు మరణ కాలమందు కూడా, నన్నే స్మరిస్తూ శరీరం విడుస్తాడో, అతడు నిస్సందేహంగా నన్నే పొందుతాడు ........ అని భగవానుడు చెప్పాడు.

***16.3.*** ఏ ఇతర చింతలూ లేండా భగవంతునే నిత్యమూ ఆరాధిస్తుంటే ఆ భగవంతుడే భక్తుని యొక్క యోగ క్షేమాలన్నీ వహిస్తాడు.

***16.4.*** భక్తులు నాలుగు విధాలైన వారుగా ఉంటారు - ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానులు అని, తీవ్రమైన ఆర్తి, ఆపదలో నున్నవారు ఆర్తులు ఏవేవో కోర్కెలు తీరాలనే కాంక్షతో దేవుని ఆశ్రయించే వారు అర్థార్థులు. భగవంతుని గూర్చి ఆధ్యాత్మ విషయాల గూర్చి తెలుసుకోవాలనే వాంఛ కలిగి యున్నవారు జిజ్ఞాసువులు. భగవత్ తత్త్వం గురించి బాగుగ తెలుసుకొని సర్వమూ వాసుదేవ మయమే అని దర్శించువారు జ్ఞానులు. ఏ భక్తుడు ఏవిధంగా ఆరాధిస్తే ఆవిధంగానే భగవంతుడు అనుగ్రహిస్తాడు.

***16.5.*** మిక్కిలి శ్రద్ధ కలవాడును, తదేక నిష్ఠ కలవాడును, ఇంద్రియాలను సంయమించిన వాడును, జ్ఞానాన్ని పొందగలడు, కాని, భగవంతుని గురించి తెలుసుకో దలచుకోని అజ్ఞానీ, దేనియందూ శ్రద్ధలేనివాడూ, అన్నింటినీ సందేహంతోనే చూచువాడూ, అయినట్టి వ్యక్తి, పరలోకం పొందలేడు సరికదా, ఇహలోకంలో కూడా సుఖించ కుండా నశిస్తాడు. భగవంతుని ద్వేషించే వారు అసుర జన్మ లెత్తుతారు.

***16.6.*** భగవంతుడులేని చోటు, లేని వస్తువూ, లేనే లేదు. మణులయందు గుచ్చబడిన సూత్రంలాగ ఈ విశ్వమంతా వ్యాపించి దానిని ధరించి యున్నాడు. అనేక జన్మల తరువాత జ్ఞాని అయినవాడు భగవంతుని కొలవాలనుకొంటాడు. అట్టివారిలో ఏ కొద్దిమంది మాత్రమే సర్వమూ సర్వేశ్వర మయమే అని తెలుసుకొంటారు.

***16.7***. జ్ఞాని అయిన వాడు, పవిత్రుల పట్లనూ, నీచ జంతువుల పట్లనూ, పాపాచారుల పట్లనూ, మట్టిబెడ్డ, బంగారపు ముద్ద పట్లనూ, సర్వభూతాల పట్లనూసమభావమే కలిగి యుంటాడు.

***16.8.*** భగవంతుడు సర్వభూతాల యందు సమభావం కలిగియుంటాడు. ఆయనకు ఇష్టుడూ, అనిష్టుడూ అంటూ ఎవ్వరూ ఉండరు. అయిననూ, ఆయన్ను భక్తితో సేవించేవారు ఆయనయందే ఉంటారు గనుక, ఆయన, అట్టి భక్తులకు సన్నిహితంగా నున్నట్టే అవుతుంది. ఎవ్వడైనా, ఎటువంటి దుశ్చరిత్రుడై నప్పటికీ, భగవంతుణ్ణే అనన్యభక్తితో కొలిచిన నాడు, అతడు సన్మార్గంలోకి మారినవాడే అని భావించాలి.

అట్టివాడు శీఘ్రంగానే సన్మార్గవర్తనుడై, ధర్మాత్ముడై, ఉద్ధరింప బడుతాడు. భగవంతుని భక్తుడు ఎన్నడూ చెడిపోడు. ఇది పరమ సత్యము.

***16.9.*** పరమేశ్వరుడు సర్వభూతాల హృదయ సీమలో నివశించి యున్నాడు. తన మాయచే వాటిని, యంత్రాన్నెక్కిన బొమ్మల్లాగ, గిరగిర త్రిప్పుతుంటాడు. అందుచేత ఆయన్నే సర్వ విధాల శరణుజొచ్చి, ఆయన అనుగ్రహంచేత, పరమశాంతినీ, శాశ్వత పదాన్నీ మానవుడు పొందవచ్చు.

***16.10. గీతలో శ్రీకృష్ణుడు ఇచ్చిన అంతిమ సందేశం :-***
అర్జునా! నాయందే మనసు నిలుపుకో, నాయందు భక్తి కలిగియుండు, నాగురించి యాగం చెయ్యి, నాకు నమస్కరించు. నిశ్చయంగా నన్నే చేరగలవు. సమస్త దేహేంద్రియ మనోబుద్ధి ధర్మాలను విడిచి పెట్టి, నన్నే శరణు వేడుకో. నేను, నిన్ను, సమస్త పాపాల నుండి విముక్తుణ్ణి చేస్తాను. చింతించవద్దు.

***గీతలో ఇంకా అనేకం చెప్పబడ్డాయి:-*** మానవుడు బంధవిముక్తుడై మాధవుని చేరడానికి మార్గాలను జూపే కర్మయోగము, రాజయోగము, భక్తియోగము, జ్ఞాన యోగముల గూర్చి చెప్పబడింది. ఈ యోగాభ్యాసాల ద్వారా ఉన్నత పదానికి ఎదిగిన మహనీయుల లక్షణాలు ఎలాగుంటాయో వివరింపబడింది. (స్థితప్రజ్ఞుడు, యోగారూఢుడు, భక్తుడు, జ్ఞాని, త్రిగుణాతీతుడు, దైవీగుణ సంపన్నులు ( తత్ విరుద్ధులైన ఆసురీగుణ సంపన్నులూ) ఇత్యాదుల గుణ స్వభావాలు చెప్పబడినవి) ఇంకా ప్రకృతి, పురుషుడు, ఆత్మ, బ్రహ్మము, భగవానుని దివ్యవిభూతులు , విశ్వ రూపము, సృష్టి, పునర్జన్మ, మోక్షము, మొదలైన ఎన్నో మహత్తర విషయాలను గూర్చి వివరింపబడింది.

## 17. మానవుడు పతనం చెందడానికి కారణమేమి?

మానవుని సకల కార్యకలాపాలూ, కన్నులు, చెవులు, ముక్కు, నాలుక, చర్మములతో కూడియున్న అయిదు జ్ఞానేంద్రియాల ద్వారానూ, అయిదు కర్మేంద్రియాలయిన వాక్కు కాళ్లు, చేతులు, గుదము, గుహ్యముల ద్వారాను జరుగుతాయి. జ్ఞానేంద్రియాలు, వాటి యొక్క విషయాలైన దృశ్యాలను, శబ్దాలను, వాసనలను, రుచులను, స్పర్శలను, బైటప్రపంచం నుండి పరిగ్రహించి, మనస్సుకు చేర్చుతాయి. సంశయాత్మకమైన మనస్సు వాటిని స్వీకరించాలా, వద్దా, అని తేల్చుకోలేక

బుద్ధికి నివేదిస్తుంది. నిశ్చయాత్మకమైన బుద్ధి, నిశ్చయించి, మనస్సుకు తెలియజేస్తుంది. మనస్సు, కర్మేంద్రియాలకు ఆదేశిస్తుంది. మనస్సు చెప్పినట్టే కర్మేంద్రియాలు ఆ కార్యాలను నిర్వహిస్తాయి. ఈ కర్మల వలన కలుగు అనుభవాలను బుద్ధి చిత్తానికి నివేదిస్తే, అక్కడ అవి వాసనా (సంస్కార) రూపంలో నిక్షేపింపబడియుంటాయి. మళ్లీ అలాంటి అనుభవమే ఎదురైతే చిత్తంలో అణగియున్న పూర్వవాసనలు పైకి వచ్చి, దానిని ఆహ్వానించడమో తిరస్కరించడమో చేయమని బుద్ధికి స్ఫురింపజేస్తాయి. చిత్తానికి వెనుకనున్న అహంకారం (నేను, నేను అంటూ ఉండే తత్త్వము) సకల కర్మలకూ నేనే కర్తను అని, సకల కర్మఫలాలకు నేనే భోక్తను అనీ, అనుకొంటూ ఉంటుంది. దీనినే అహంకారం అంటారు. అనుభవించదలచుకొన్న వస్తువులూ విషయాలూ, వ్యక్తులూ, నావి, నావారు అనుకొనే భావాన్ని మమకారం అంటారు . ఈ అహంకార మమకారాలే, మానవునికి సంభవించే అన్ని అనర్థాలకూ ఉత్పత్తి స్థానాలు. ఈ అహంకారమే, దేహేంద్రియ అంతఃకరణాలకు చైతన్యశక్తి నిచ్చి, అంతర్యామియై, అకర్తయై, నిరంజనమై యున్న ఆత్మను (జీవాత్మను) ఆవరించి యుంచి, ఆత్మను ఆవేశించి, తానే (ఆత్మయే) సకల కర్మలకు కర్తనూ కర్మ ఫలాల భోక్తనూ అనుకొనేటట్టి భ్రమలో ముంచి, జీవుణ్ణి, జనన మరణ సంసార విషవలయంలో చుట్టుకొనేటట్టు చేస్తుంది. ఇది, ఆధ్యాత్మిక స్థాయిలో జరిగే పతనం లౌకిక రంగంలో కూడా, ఈ అహంకార మమకారాలూ, వాటి ఉపకరణమైన ఇంద్రియలోలత్వమూ, అంతులేని హానిని కలుగ జేస్తాయి. ప్రపంచమంతటా సంభవిస్తున్న అలజడీ, అల్లకల్లోలమూ, అశాంతీ, అనర్థాలకు మూలకారణం ఇవే.

*ఇంద్రియాల గురించి, గీతలో ఇలా చెప్పబడింది:*

విషయ వస్తువులతో ఇంద్రియాలకు సంయోగం కలిగినప్పుడు శీతోష్ణాది స్పర్శలు కలిగి, మనస్సుకు ఆయా అనుభావాలు కలుగుతాయి. ఈ సంయోగ వియోగాలు క్షణికమైన సుఖదుఃఖాలను కలుగజేస్తాయి. అవి ఎప్పుడూ, వస్తూ పోతూ ఉండే, నిలకడలేని స్వభావం గలవి. అవి మొదటిలో సుఖాన్నిచ్చేటట్టు కనిపించినా, చివరి పరిణామం దుఃఖమయం, గనుక బుద్ధిమంతులు వాటియందు ఆనందించరు. వాటిని లెక్కజేయక ఉదాసీనంగా భరిస్తారు. ప్రతీ ఇంద్రియానికీ తనకు ప్రియమైన విషయాలపై రాగమూ, అప్రియమైన వాటిపై ద్వేషమూ

కలుగుతాయి, గాని వాటికి లోబడ కూడదు. అదుపులేని మనస్సు, ఇంద్రియాల వెంబడి, విషయాలపైకి పరుగులిడు తుంటే, ఆ రెండూ కూడి, బుద్ధిని హరించి వేస్తాయి. ఇంద్రియాలు మహాశక్తివంత మైనట్టివి. ఆత్మదర్శనం గురించి పాటు పడ్తుండే జ్ఞాని యొక్క మనస్సును కూడా, అవి బలవంతముగ విషయాలపైకి తోసుకుని పోతాయి. అలాంటి ఇంద్రియాల్ని వశపరచుకొని, సాధకుడు మనః స్థిరత్వముతో, భగవంతుని యందు ఆసక్తిని పెంపొందించు కోవాలి. మనస్సుచే ఇంద్రియాలను విషయాలనుండి మరల్చి, వాసనాజనితమైన కోరికలను పూర్తిగా వర్జించి, మెల్లమెల్లగా, ధైర్యముతో బుద్ధిని ఆత్మయందే లగ్నం చేయాలి. అందుచేత మొట్టమొదట ఇంద్రియాలను అదుపులో పెట్టుకొని, జ్ఞాన విజ్ఞానాలను నశింపజేసే పాపి అయిన కామాన్ని పారద్రోలాలి. ఇంద్రియ నిగ్రహం, మనః సంయమము లేని వానికి వివేక బుద్ధి కలుగదు. ఆత్మ చింతన సాధ్యపడదు. ఆత్మ చింతన చేయని వానికి శాంతి లభించదు. శాంతిలేని వానికి సుఖమెక్కడిది?

ఇక కామం ఎలాంటి దంటే- మహాపాపిష్టిది. కామం అంటే కోరికల ప్రేరణ, కోరికలపుట్ట. మానవుడు తన మెడకు తానే బిగుంచుకొన్న ఉచ్చు. ఎంతటి ధీరుడైనా పతన మవడానికి దారితీసే మొదటి మెట్టు. కామము, మానవుని యందు దాగియుండు ఆరుగురు శత్రువులకూ అధినేత.

విషయాలు గురించి ఆలోచిస్తూ ఉంటే వాటిపైన ఆసక్తి (వాంఛ) కలుగుతుంది. ఈ వాంఛ బలపడి కోరిక (కాంక్ష) అవుతుంది. తీరిన కోరిక ఇంకా తీరాలనీ, తీరని కోరిక ఎందుకు తీరటం లేదనీ, క్రోధం పుడ్తుంది. క్రోధము వలన ఆవేశమూ, ఆవేశం వలన మతిభ్రమ, మతిభ్రమచే బుద్ధినాశమూ, బుద్ధి నాశముతో సర్వనాశనమూ సంభవిస్తాయి. రజోగుణముచే పుట్టిన కామమే, పాపకార్యాలను చేయిస్తుంది. ఇది పరమ శత్రువు. చిల్లుకుండలో ఎంతనీరు పోసినా నిండనట్లు, కామము ఎంత తీర్చినా తీరనట్టిది. తీర్చుతున్న కొద్దీ అగ్నివలె రెచ్చిపోతుంది జ్ఞానాన్ని కప్పి ఉంచుతుంది. దీనికి ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ, ఆశ్రయమిచ్చే స్థావరాలు. వినాశకరమైన ఈ కామాన్ని, బుద్ధిచేత మనస్సు నరికట్టి, మనస్సుచే ఇంద్రియాలను వశపరచుకొని జయించి, పారద్రోలాలి. లేనిచో, ఇహలోక సుఖానికీ, మోక్షానికీ, మానవుడు దూరమవుతాడు. అందుచేత, బుద్ధిమంతుడైన మానవుడు ఈ కామశత్రువును జయించాలి.

కామము, ఇంద్రియ లోలత్వములతో పాటు సంగదోషాన్నికూడ వర్జించాలి. వ్యక్తుల యందు, విషయ, వస్తువుల యందూ విడిచి ఉండలేనంత ఆసక్తి వ్యామోహం, పెంచుకోవడమే సంగదోషం అనబడుతుంది. ఇది, మానవుణ్ణి మమకార మోహంలో బంధించి ఉంచుతుంది. పురోగమించ నివ్వదు.

అహంకారము, అసురగుణాలతో పుట్టిన వారి ప్రథమ లక్షణం. దీనితో పాటు, బలమదము, దర్పము, కామము, క్రోధము, పారుష్యము మొదలైన అన్ని అవగుణాలూ కూడి యుంటాయి. అతిశయించిన అహంకారం కలవారు, తామే అందరికంటె అధికులమనుకొని, ఆ ఆధిక్యతను ప్రదర్శించుకోడానికి ఎలాంటి అత్యాచారాన్ని చేయడానికైనా వెనుదీయరు. జరుగు చుండే అన్ని కార్యాలకూ, వారు తామే కర్తల మనుకొనేటట్టి మూఢులై యుంటారు. లేని అధికారాన్ని ఊహించుకొని, నిరంకుశులై, లోకకంటకులై, అందరినీ శాసించాలను కొంటారు వారు, అందరికీ శత్రువులుగా తయారయి, వారి పతనానికి వారే గొయ్యి త్రవ్వుకొంటారు.

ఈ స్థితినుండి బైట పడాలంటే ప్రప్రథమంగా ఇంద్రియాలనూ, మనస్సునూ నియంత్రించుకోవాలి. మనస్సును నిగ్రహించడం కష్టమే కాని, అసంభవంకాదు. అభ్యాసము చేతను, వైరాగ్యము చేతను సాధించవచ్చు. మానవుడు తన్నుతానే ఉద్ధరించుకోవాలి గాని దిగజార్చుకోరాదు. ఇంద్రియాలను జయించిన వాడు, తనకు తానే బంధువవుతాడు. అలాగ జయించ లేని వాని మనస్సే అతనికి శత్రువులాగ ప్రవర్తిస్తుంది. ఇంద్రియాలూ మనస్సూ లొంగిపోగానే కామానికి మరి తావుండదు. కోరికలు ప్రవేశించలేవు. అన్నీ వశమై పోయినప్పుడు అహంకార మమకారాలు కూడా విజృంభించలేవు. ఈ విధంగా విజయం సాధించి, పురోగమించువచ్చు.

---

''ఆవృతం జ్ఞానమేతేన, జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌంతేయ, దుష్పూరేణానలేనచ ॥ 3-39

కౌంతేయా! అగ్నివలె, తృప్తి చెందనట్టి ఈ కామము జ్ఞానాన్ని కప్పివేసి, జ్ఞానికి నిత్యశత్రువై యుంటుంది. దీనిని పారద్రోలాలి.

## 18. కర్మయోగము

వేదాంత సారమైన భగవద్గీత సన్న్యాసుల కోసమే చెప్పబడిందనే అపోహకు ఆధారంలేదు. ''నకాంక్షే విజయం కృష్ణ! నచ రాజ్యం సుఖాని చ. నయోత్స్య. శ్రేయో భోక్తుం భైక్ష్యం'' (కృష్ణా! నాకు విజయం వద్దు, రాజ్యం వద్దు, సుఖమూ వద్దు. నేను యుద్ధం చేయను. దానికంటె, సన్న్యసించి, భిక్షమెత్తుకుని బ్రతకడమే శ్రేయస్కరం) అంటూ గాండీవాన్ని పడవేసి, చతికిలబడిన అర్జునునకు కర్తవ్యాన్ని బోధించి జ్ఞానోదయం కలిగించి, '' నష్టో మోహః స్మృతిర్ లబ్ధ్వా ... కరిష్యే వచనం తవ'' (నా మోహం నశించింది, జ్ఞానం లభించింది. నీ ఆజ్ఞను నెరవేర్చుతాను) అని అతనిచే అనిపించి, అతణ్ణి కార్యోన్ముఖునిగా చేసింది గీతాబోధ. అతనిలో బంధువ్యామోహంచే ఆవేశించిన మానసిక జడత్వాన్ని తొలగించి అతని యొక్క క్షాత్ర ధర్మ-సహజమైన ధైర్య స్థైర్య సాహస ప్రతాపాలను ప్రకటింపజేసింది. ఈ జగత్తులో, ప్రతీ ఒక్కడూ అహంకార మమకార వ్యామోహ విషాదాలకు గురి అవుతుండే ఒక అర్జునుడే. ఈ అర్జున జాడ్యానికి శ్రీకృష్ణ గీతామృతమే ఏకైక దివ్యౌషధం.

జీవి చేస్తుండే ప్రతీ కార్యమూ, ప్రతీ కదలికా, చివరకు శ్వాసక్రియ కూడా ఒక కర్మయే. కర్మచేయకుండా, ఎవ్వరూ ఒక్కక్షణమైనా ఉండలేరు, గనుక కర్మ చేస్తూ కూడా తరించే మార్గాన్ని గీత చూపించింది.

మనం చేసే ప్రతీ ఆలోచన, ప్రతీ పనీ, మన పూర్వ కర్మ సంస్కారాల ననుసరించియే సంభవిస్తుంది. కర్మఫలాన్ని ఎప్పుడో ఒకప్పుడు అనుభవిస్తేనే తప్ప ఆకర్మ నశించదు. అందుచేత, పూర్వకర్మ ఫలాలను అనుభవిస్తూ, కొత్త కర్మ ఫలాలను ఆర్జించుకోకుండా జాగ్రత్త పడితే, క్రమంగా పాతకర్మలు నశించి, వాసనా క్షయం అవగానే, జన్మరహిత స్థితి ఏర్పడి మోక్షం సిద్ధిస్తుంది. భక్తి, జ్ఞాన, ధ్యాన సాధనలు చేయలేని వారు కూడ కర్మయోగాన్నాశ్రయించి, తరించవచ్చు. అయితే కర్మయోగం అంటే ఏమిటి?

గీతా కాలం నాటికి పామరులే కాకుండా పండితులూ, పాలకులూ కూడా, ఏదో ఒక ఫలాపేక్షతోనే, వైదిక కర్మలైన యజ్ఞయాగాది క్రతువులను చేయుస్తుండేవారు. కర్మ అనే శబ్దానికి, ఈ వైదిక కర్మకాండలే, అనే అర్థం వాడుకలో నుండెను. కాని, గీతలో భగవానుడు. కర్మకు సరియైన అర్థాన్ని తెలియజేశాడు.

స్వార్థరహితంగా, లోక కల్యాణం గురించి చేయబడిన కర్మలు యజ్ఞములతో సమానం. కామ్య కర్మలు (ఫలాపేక్షతో చేయబడిన కర్మలు), స్వార్థం కోసం చేయబడిన కర్మలు నికృష్టమైనట్టివి. వాటివలన కర్మబంధాలేర్పడి, పాపం చేకూరుతుంది. కాని, నిష్కామ కర్మలు, స్వార్థరహిత కర్మలు, లోక కల్యాణ కరమైన కర్మలు, కర్తృత్వభావము లేకుండా, ఈశ్వరార్పణగా చేయబడిన కర్మల యొక్క కర్మ ఫలాలు కర్తకు అంటుకోవు, కర్మబంధం కలిగించవు ఈ విధంగా చేయబడిన అనాసక్త కర్మలే కర్మయోగం అనబడుతుంది.

''నా గురించి,'' ''నావారి గురించి'' అనే మమకారం లేకుండా పని చేయడమే నిస్స్వార్థ కర్మ '' ఈ కార్యాన్ని నిర్వహించడమే నా విధ్యుక్తధర్మం. దీనియొక్క ఫలితంతో నాకు ప్రమేయం లేదు. భగవంతుడేది అనుగ్రహిస్తే అదే మహా ప్రసాదం'' అనే అచంచల విశ్వాసంతో కర్మలనాచరించడం వలన అపరిమితమైన ఆనందమూ శాంతీ లభిస్తాయి. కర్మ ఫలమందు కాంక్షలేకుండా, లోక కల్యాణమే దాని ప్రయోజనమని నమ్మి, ఈశ్వరార్పణ భావంతో నిశ్చింతగా రాజ్యాలైనా ఏలవచ్చు, యుద్ధాలైనా చెయ్యవచ్చు. వాటివలన ఎలాంటి పాప పుణ్యాలూ అంటుకోవు. అహంకార మమకారాలు నశిస్తాయి. వాసనా ప్రవాహం ఇంకిపోతుంది. జనన మరణ సంసార బంధం వీడిపోతుంది.

ఇటువంటి కర్మయోగాభ్యాసం చేత :-
కర్మణా జాయతే భక్తిః, భక్త్యా జ్ఞానం ప్రజాయతే,
జ్ఞానాత్ ప్రజాయతే ముక్తిః, ఇతి శాస్త్రార్థ సంగ్రహః

భక్తి అంకురిస్తుంది, భక్తి నుండి జ్ఞానోదయం కలుగుతుంది, జ్ఞానం వలన మోక్షం కలుగుతుంది. జ్ఞానం వలన సిద్ధించే స్థితి, నిష్కామ కర్మ వలన కూడ సిద్ధిస్తుంది. కర్మయోగం వలన చిత్తశుద్ధి, దానివలన తత్త్వ జ్ఞానము, తత్త్వ జ్ఞానం వలన మోక్షము, సిద్ధిస్తాయి. ఇదియే కర్మయోగ రహస్యము.

## 19. రాజయోగము.

యుజ్యతే ఇతి యోగః ( జీవుణ్ణి పరమాత్మతో సాయుజ్యము చేయునది యోగము) అని అన్నారు. ఈ యోగ శబ్దాన్ని విభిన్న అర్థాలతో వినియోగించారు చిత్తమును వశపరచుకొని, శారీరిక సాధనలద్వారా అద్భుత శక్తులను సిద్ధింపజేయు

శాస్త్రాన్ని కూడా యోగశాస్త్రమంటారు. పాతంజల యోగ సూత్రాలు ప్రసిద్ధమైనవి. ఈ గ్రంథాన్ని అష్టాంగయోగం అని కూడా అంటారు.

**ఆ అష్టాంగాలు ఇవి :**

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి.

***1. యమము*** :- అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము ఈ అయిదూ కూడి యమము యొక్క ఉపఅంగాలు.

**అహింస** అంటే, మనోవాక్కాయ కర్మలా ఏ ప్రాణికీ ఎటువంటి హింసా తల పెట్టకుండడం.

**సత్యము** అంటే, ఎట్టిపరిస్థితుల్లోనూ అసత్యమాడ కుండడం, సత్య నిష్ఠనే పాటించడం.

**అస్తేయము** అంటే ఇతరుల వస్తువులను అపహరించ కుండడం.

**బ్రహ్మచర్యము** అంటే, కేవలం స్త్రీ పురుష సంభోగ నిగ్రహం మాత్రమే కాదు ఇంద్రియాలు కాంక్షించే సుఖభోగాల నుండి మానసికంగా కూడ దూరంగా నుండడం. మోక్షకాములైన సాధకులకు, యోగులకు, జ్ఞానులకు కూడా బ్రహ్మచర్యం అవశ్యం అనుష్ఠించ వలసిన సాధన. ఆధ్యాత్మిక శక్తి, బ్రహ్మచర్యం లేనిదే సిద్ధించదు.

**అపరిగ్రహము** : అంటే ఇతరులనుండి ఏమీ తీసుకొన కుండడం, అస్తేయముతో పాటు అపరిగ్రహం కూడ యోగికి ఒక ముఖ్యమైన నియమం. గ్రహిస్తే దాతయొక్క పాపం కూడ కొంత గ్రహించినట్లు యోగి భావించాలి.

యమములో పది ఉపాంగాలున్నట్లు కూడ చెప్పబడింది. అవి :

అహింసా సత్యమస్తేయం, బ్రహ్మచర్యం, దయార్జవం,
క్షమాధృతిర్ మితాహారః శౌచం, చేతి యమాదశ.

ఈ యమము యోగులేకాక సర్వజనులూ పాటింప దగిన మహావ్రతము.

***2. నియమము*** :- శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరారాధనము ఈ అయిదు నియమము యొక్క ఉపాంగాలు.

శౌచము అంటే, బాహ్య (శరీర,వస్త్ర,పరిసర, ఖాద్య) శౌచము.

అంతర్ (కామ క్రోధాది మనో మాలిన్యాలు తొలగించుకొనే) శౌచము.

సంతోషము అంటే సర్వావస్థలలోనూ సంతోషమానసాన్ని కలిగియుండడం తపస్సు అంటే ఉపవాస జాగరణాది వ్రతాల ద్వారా ఇంద్రియ మనోబుద్ధులను నియంత్రించి తపింప జేయడం.
స్వాధ్యాయం అంటే, ఆధ్యాత్మిక, శాస్త్ర గ్రంధ పఠనము, పాఠనము, శ్రవణము, చర్చలు మొదలైనవి అభ్యసించడం.
ఈశ్వరారాధనము అంటే ఈశ్వర ప్రణిధానము, ఆరాధన, సమర్పణ భావంతో సేవలు చేయడం. తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము ఈ మూడింటినీ, క్రియాయోగమంటారు.

***3. ఆసనము*** :- స్థిర సుఖమాసనం. యోగాభ్యాసానికి ఆసన సిద్ధి చాలా అవసరం. కొన్ని గంటలైనా స్థిరంగా సుఖంగా కూర్చొనగలుగునట్టి ఆసనాన్ని అలవరచుకోవాలి.

***4. ప్రాణాయామము*** :- ఆసన సిద్ధి తరువాత నాడీ శౌచము చేసుకొని ప్రాణాయామాన్ని అభ్యసించాలి. ఉచ్ఛ్వాస నిశ్వాసలకు గతినియంత్రణ చేయడాన్ని ప్రాణాయామం అంటారు. రాజయోగంలో ఇది ముఖ్యమైన సాధన దీనిద్వారా చిత్త వృత్తి నిరోధముతో వాసనాక్షయము సిద్ధిస్తుంది.

***5. ప్రత్యాహారము*** :- కన్నులు చెవులు మొదలైన ఇంద్రియాలు, వాటియొక్క విషయాలైన దృశ్యములు, శబ్దాలు మొదలైన వాటిని నిరాకరించి, చిత్తముతో ఏకమవడం, ప్రత్యాహార మంటారు.

***6. ధారణ:***- చిత్తాన్ని ఏదోఒక చోట నిలిపి ఉంచడాన్ని ధారణ అంటారు. అంటే, హృదయస్థానంలో నిలిపి, శరీరంలోని ఇతర భాగాలనుండి ఇంద్రియానుభవాలను మనసు స్వీకరింపకుండా మరల్చి, హృదయమందే నిలిపి ఉంచాలి.

***7. ధ్యానము*** :- అవిచ్ఛిన్న తైలధార వలె మనస్సును లక్ష్యమందు ఏక భావ ప్రవాహముగ కొంత సమయము నిలపడాన్ని ధ్యానమంటారు. మనస్సును విషయరహితం చేయడం.

***8. సమాధి*** :- ఆలంబన (ధ్యేయ వస్తువు) పైన మనస్సును 12 క్షణముల కాలము నిలుపునపుడు ఒక ధారణ అనబడుతుంది. 12 ధారణలు ఒక ధ్యానము. 12 ధ్యానములు ఒక సమాధి. ధ్యాన ధారణ సమాధులు చేరి, సంయమం అనబడుతుంది. (7 సెకండ్లు ఒక ధ్యానము, 49 సెకండ్లు ఒక ధారణ, 5 ని॥, 43 సెకండ్లు 1 సమాధి) సమాధి రెండు విధాలు- సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత అని.

***సంప్రజ్ఞాత సమాధి స్థితి :-*** ఇది 4 దశలలో సంభవిస్తుంది.

1. వితర్క : స్థూల ప్రకృతిని ( భూమి, జలము మొ॥) ధ్యేయముగా నిలిపి ధ్యానించడం.
2. విచారము : సూక్ష్మ భూతములను ( దృశ్య, శబ్దాదులు) ధ్యేయముగా నిలిపి ధ్యానించడం.
3. ఆనందము : రజస్తమోగుణములు లేని మనస్సును ఆలంబనముగా ధ్యానించడం.
4. అస్మితము : పై మూడు స్థితులను దాటి శుద్ధ సాత్త్విక చిత్తము ఆలంబనంగా ధ్యానించడం.

ఈ స్థితిలో అహంకారం నిలిచియుంటుంది. చిత్తము శాంతించి, బీజరూప సంస్కారాలు అణగి యుంటాయి. దీనిని సబీజసమాధి. సవికల్పసమాధి అంటారు. ఈ స్థితిలో యోగి అనేక సిద్ధులను పొందవచ్చును గాని ముక్తుడు కాలేడు.

***అసంప్రజ్ఞాత సమాధి స్థితి*** :- ఈ స్థితిలో నేను అనే అహంకారం ఉండదు. కర్మ బీజం నశిస్తుంది. (నిర్బీజ సమాధి). వాసనాక్షయం, మనోనాశం కలుగుతాయి. ఇది ముక్తి ప్రదము. నిర్వికల్ప సమాధి.

మంత్రయోగము, హఠయోగము, లయయోగము, రాజయోగములలో రాజయోగము శ్రేష్ఠమైనది. రాజయోగానికి అనేక అర్థాలున్నా, కుండలినీ శక్తిని ఉత్తేజపరచి, సుషుమ్న ద్వారముగుండా సహస్రారానికి చేర్చడమే ఈ యోగఫలం అంటారు.

## ౨౦. భక్తి యోగము

వేదాలలోని కర్మకాండ, ఉపనిషత్తులలోని జ్ఞాన సాధన, సామాన్య జనులకు సులభ సాధ్యము కానందున భక్తి మార్గము వెలసినది. భక్తి మార్గము బ్రహ్మమానస పుత్రుడైన నారదునిచే బాగా పెంపొందింపబడింది. ముఖ్యముగ, వాసుదేవ భక్తి సనాతన కాలం నుండి ప్రచారమందున్నది. శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణపత్యాది భక్తి ప్రకరణలు కూడా వెలసినవి. మహావిష్ణువు నారదునకు ఉపదేశించిన భాగవత ధర్మము సర్వప్రసిద్ధము. దానినే నారాయణీయమనీ, పాంచరాత్రములనీ, సాత్వతమనీ,

ఏకాంతిక ధర్మములనీ అంటారు. ఈ నారాయణీయాన్నే నారదమహర్షి ముల్లోకాల్లోనూ వినిపించి, ప్రజలను భక్తి పరాయణులుగా చేశాడు. అష్టాదశ పురాణాల్లోనూ, వేదవ్యాస ఋషి జ్ఞానసహిత భక్తిని విస్తృత పరిచాడు.

భక్తి అంటే, పరమేశ్వరుని యందు అచంచల అనన్య ప్రేమను కలిగి యుండడం. ప్రేమ అనుభవైకవేద్యమే కాని, అనిర్వచనీయము. ఇహపర సంబంధమైన ఎలాంటి ఫలాన్నీ కోరక భగవంతుని సేవచేయడం భక్తి అని కూడ అన్నారు. ధనాన్ని కోరి భగవంతుని భజించే వ్యక్తి యొక్క దృష్టిలో, భగవంతుని కంటే ఆ ధనమే ఎక్కువ విలువైనదీ, కోరదగినదీ, అన్నమాట. అది భక్తికాదు. అలాగే దారాపుత్ర ధన కనక వస్తువాది సంపదలను కోరుతూ చేసే పూజలూ భక్తి అనిపించుకోవు. భగవంతుని యడల పరమప్రేమాను రక్తులు, ఎడతెగని స్మరణ (ప్రహ్లాదునివలె, గోపికలవలె) నిరంతరాన్వేషణమూ, ఆత్మార్పణమూ, భక్తిని సూచించు లక్షణాలు.

భగవంతుని దివ్యసుందర విగ్రహాన్నీ, కల్యాణగుణ వైభవ గాథలనూ, నిత్యమూ వర్ణిస్తూ స్తుతిస్తూ, శ్రవణమననాలు చేస్తూ, గానం చేస్తూ ఉంటే భగవంతునియందు భక్తి పెరుగుతుంది. భక్తి లేనిదే ముక్తి లేదంటారు.

పరమ భాగవతుడైన ప్రహ్లాదుడు, భక్తి తొమ్మిది విధాలుగా నుంటుందని చెప్పాడు. భగవంతుని లీలాగుణవైభవగాథలను వినడము (శ్రవణం), కీర్తనం స్మరణం, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మార్పణము. భక్తులు వారివారి పూర్వ సంస్కారానుగుణంగా ఏవో కొన్ని పద్ధతులను అనుసరిస్తారు. గీతలో నాలుగు విధాలైన భక్తులున్నట్టుగా భగవానుడు చెప్పాడు- ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానభక్తులు. తీవ్రమైన మానసిక శారీరిక బాధలోను, ఆపదలోనూ ఉన్నప్పుడు దేవుని ప్రార్థించేవాడు ఆర్తుడు (ద్రౌపది, గజేంద్రుడు). ఏదో ఒక మనోకామన (కోరిక) తీరాలని, స్వలాభం గురించి ప్రార్థించేవాడు అర్థార్థి. భగవంతుని గురించి తెలుసుకోవాలనే ప్రగాఢ కాంక్షతో అన్వేషించువాడు జిజ్ఞాసువు. (ఉద్ధవుడు. పరీక్షితుడు, వివేకానందుడు) సర్వమూ వాసుదేవ మయమే అని తెలుసుకొని, అంతటా ఆ భగవంతుణ్ణే చూడదలచుకొన్న వాడు జ్ఞాని (ప్రహ్లాదుడు).

ఈ నాలుగు వర్గాల వారూ భక్తులే అయినను, జ్ఞాని మాత్రము భగవంతునకు మిక్కిలి సన్నిహితుడు.

కృతయుగంలో ధ్యానము ద్వారాను, త్రేతాయుగంలో యజ్ఞాల ద్వారాను, ద్వాపర యుగంలో అర్చన ద్వారాను, లభ్యమయే ఫలము కలియుగంలో సంకీర్తన మాత్రంచే ప్రాప్తిస్తుంది. నామస్మరణ (సంకీర్తనం) అతి ఉత్తమ మైనట్టి, అతి సులువైనట్టి, భక్తి సాధన. నారదునకు బ్రహ్మదేవుడు ఉపదేశించిన మహిమాన్వితమైన కలిసంతరణ మంత్రమిది : హరేరామ హరేరామ రామరామ హరేహరే, హరే కృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే-నామస్మరణ వలన రత్నాకరుడు వాల్మీకి మహర్షి అయ్యాడు, అజామిళుడనే పాపాత్ముడు యమభటుల నుండి రక్షింపబడ్డాడు. ఖట్వాంగ చక్రవర్తి ఒక్క ముహూర్తకాల నామస్మరణచే కైవల్యాన్ని పొందాడు.

భక్తి, గౌణభక్తి, పరాభక్తి, అని రెండు స్థాయిలలో నుంటుంది. సత్త్వరజస్తమో గుణాలతో నిండియున్న మనస్సుతో చేయబడిన భక్తి సాధనలను అపరాభక్తి (గౌణభక్తి) అంటారు. భగవంతుణ్ణి, నానావిధ ఉపచారాలతో అర్చించడం భజించడం, కీర్తించడం, ప్రార్థించడం మొదలైనవి అపరాభక్తి యొక్క ప్రక్రియలు. సకామ భక్తులు, ఆర్తులు, అర్థార్థులు, ఈ వర్గానికి చెందినవారు. అపరా భక్తి దశ నుండి క్రమ వికాసం చెంది, పరాభక్తి దశకు ఎదుగుతారు. ఇది భక్తి యొక్క సిద్ధా వస్థ. కైవల్యావస్థయే అనవచ్చు. జీవన్ముక్త స్థితి. అపరాభక్తి అవస్థల నుండి పైకి వచ్చి, సంపూర్ణ వైరాగ్యాన్ని సాధిస్తేగాని, పరాభక్తి సిద్ధించదు. గీతలో భగవానుడు వర్ణించిన భక్తుడు ఈ పరాభక్తి దశకు ఎదిగినట్టివాడు. అట్టి భక్తునకు, సర్వభూతాలలో ద్వేషింపదగిన దేదీ ఉండదు. అందరి పట్ల అన్నింటియందు కరుణ, మైత్రియే కలిగి యుంటాడు. అహంకార మమకారాలసలే ఉండవు. శీతోష్ణ సుఖ దుఃఖ, నిందాస్తుతులవంటి ద్వంద్వాల పట్ల సమభావం కలిగియుంటాడు. ఓర్పు, సంతుష్టితో ఎల్లప్పుడూ ఆనందాన్ని అందరికి పంచిపెడ్తాడు. ఈ పరాభక్తునికి, మామూలు పుష్పాలు పూజా పుష్పాలు కావు. అహింస, ఇంద్రియ నిగ్రహం, సర్వ బూతదయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానము, సత్యము అను ఈ ఎనిమిది హృదయకుసుమాలూ, భగవంతుని పూజకు ఉత్తమ భక్తుడు అర్పించే పారిజాతాలు ఇలాంటి భక్తులే భగవంతునికి ప్రీతిపాత్రులు.

## 21. జ్ఞానయోగము

జ్ఞానం అంటే ఏమిటి? జ్ఞానం అనేక విషయాల గురించి ఉండవచ్చు. కాని, అవి అన్నీ లౌకిక విషయాలు. అసలైన జ్ఞానం ఆత్మజ్ఞానం, బ్రహ్మజ్ఞానం, పరమేశ్వరుని గురించి తెలియజెప్పే ఆధ్యాత్మిక జ్ఞానం. దీన్ని పొందితే ఇక ఏ జ్ఞానమూ అవసరం లేదు.

కంటికి కనిపించేదీ, ఇతర ఇంద్రియాలకు గోచరించేదీ, జగత్తు. అన్ని జీవరాశుల యొక్క జగత్తుల సముదాయమే విశ్వజగత్తు. ఈ విశ్వం ఎలాగ ఎక్కడినుండి ఉద్భవించింది ? దానికి మార్పులు ఎలాగ సంభవిస్తాయి, ఇప్పుడున్నవి కొన్నాళ్ళకు లేకుండా పోవడం ఎలాగ సంభవిస్తుంది, సూర్య చంద్రాదుల క్రమబద్ధమైన గమనము, భూమి, మొదలైన పంచ భూతాల ప్రవర్ధక శక్తి, జంతు పశుపక్షాది జీవజాతుల ఉత్పత్తి క్షయాలు ఎలాగ సంభవిస్తున్నాయి, వీటిని రచించి, రూపకల్పన చేసి, నిర్వహించే ఆ మహత్తర శక్తి ఏది? మొదలైన ఊహాతీతమైన విషయాలు గీత నుండి తెలుసుకోవచ్చు. భగవానుడే ఇలా చెప్పాడు : ''అర్జునా! నేను ఆది, అంతమూ లేని సర్వభూత మహేశ్వరుడనైనప్పటికీ, నాయొక్క మాయాశక్తిచే, ధర్మహాని కలిగి అధర్మం విజృంభించునప్పుడూ, దుర్జనులను శిక్షించి, సజ్జనులను రక్షించి, ధర్మాన్ని మళ్ళీ నెలకొల్పవలసి వచ్చునప్పుడూ, నన్ను నేను సృజించుకొని అవతరిస్తుంటాను. నామాయనుండి పుట్టిన ప్రకృతితో నాయొక్క అంశ అయిన పురుషుని కలయికచే సకల సృష్టి సంభవిస్తుంది''. ఈ ప్రకృతి పురుషులనే జడమూ చైతన్యమూ అనీ, అనాత్మ, ఆత్మ అనీ, అంటారు. వ్యష్టిగా క్షేత్రమూ క్షేత్రజ్ఞుడు అనీ, దేహమూ జీవుడూ అనీ అంటారు. ఈ రెండూ విడదీయలేనంతగా ఏకమైపోయినట్టు ప్రవర్తిస్తాయి. జడము నుండి చైతన్యాన్ని, ఉపాధి నుండి ఆత్మనూ, విడివిడిగా గుర్తించగలగడమే జ్ఞానము అనాత్మ వస్తువు యందు తగుల్కొన్న ఆసక్తిని విడదీసి, ఆత్మయందు తగిలించి, ఆత్మయందే చిత్తాన్ని నిలుపుకొని దేహధ్యాసను తొలగించుకోవడం జ్ఞానలక్షణం. ఇంద్రియ మనోబుద్ధులతో కూడియున్న శరీరాన్నే నేను అని, అజ్ఞాని భావించి, సమస్త సంసారిక బాధలను అనుభవిస్తుంటాడు. కాని, జ్ఞాని మాత్రము నేను దేహాన్ని కాను, సనాతన, సచ్చిదానంద రూప, జనన మరణ రహిత అవ్యయ ఆత్మను అనీ, అహంబ్రహ్మోస్మి అనీ, తద్ బ్రహ్మ నిష్కళమహం, న

చ భూతసంఘః అనీ చిదానందరూప, శివోహం శివోహం- అనీ, ధృఢ నిశ్చయంతో నమ్ముతాడు. నేను , నిత్యమైనట్టిదియూ, అంతటా నిండి యున్నట్టిదియూ, ఇంద్రియ మనస్సులకు గోచరించనట్టిదియూ, అవినాశియూ అయినట్టి ఆత్మను. నశించునట్టి అనాత్మ వస్తువైన శరీరాన్ని కాను. అని తెలుసు కొంటాడు.

జీవునకు దుఃఖము దేని వలన కలుగుతుంది? శరీరధారణవలన, శరీరం ఎందుకు కలుగుతుంది ? కర్మల వలన కర్మ ఎలాగ కలుగుతుంది? రాగద్వేషాదులవలన, రాగద్వేషాదులు ఎందుకు కలుగుతాయి? అజ్ఞానం వలన అజ్ఞానం పోయేదెలాగ? జ్ఞానంచే, జ్ఞానంచేతనే దుఃఖనివృత్తి, మోక్షమూ కలుగుతాయి. జ్ఞానాత్ ఏవతు కైవల్యం.

గీతలో, భగవానుడు జ్ఞాన మార్గానికే అధిక ప్రాధాన్యత నిచ్చినట్లు కనిపించినా, వాస్తవానికి, జ్ఞాన, భక్తి, యోగ, కర్మ మార్గాలన్నిటికీ ఉచిత ప్రాధాన్యత ఇవ్వబడింది. పరిణామ క్రమంలో వేరు వేరు స్థాయిలకు వికసించిన వ్యక్తులకు సరిపడునట్లు, వేరు వేరు మార్గాలు నిర్దేశింప బడినమా, అన్ని మార్గాలూ ఒకే గమ్యానికి దారితీసేటట్టివే. ఈ మార్గం గొప్పది, అది తక్కువది, అనుకొనే వారు అజ్ఞానులు అన్నియోగాల యొక్క ఏకైక ప్రయోజనం- స్వస్వరూపాను సంధానం ఈ దేహమే నేను అనే అజ్ఞానంలో మునిగియున్న జీవాత్మ యొక్క అజ్ఞానావరణను తొలగించి, తన నిజతత్త్వం అయిన పరమాత్మలో లీన మవడం.

జ్ఞానం యొక్క మూల సూత్రం - ఏకమేవా ద్వితీయం బ్రహ్మ, సర్వం ఖల్విదం బ్రహ్మ, వాసుదేవః సర్వం ఇతిం- ఉన్నది ఒకే ఒక అద్వితీయ బ్రహ్మము, సర్వమూ బ్రహ్మమయం, సర్వమూ వాసుదేవమయం, అణువణువునా వ్యాపించియున్నది ఆ పరమాత్మ యొక్క చైతన్య శక్తియే- అని గ్రహించడం. ఇటువంటి జ్ఞానికి, అందరియందు అన్నిటియందు ( ప్రహ్లాదునివలె) ఆ పరమాత్మయే గోచరిస్తాడు. అతని దృష్టిలో ఉచ్చనీచ భేదాలూ, రాగద్వేషాలూ, ప్రియాప్రియాలు, మానావమానాలు, వంటి ద్వంద్వ భావాలు ఉండవు. అతడు అన్నివేళలా, అన్ని పరిస్థితుల్లోనూ, పరమశాంతీ పరమానందమూ అనుభవిస్తుంటాడు. మరణసమయంలో కూడా అతని ధ్యానం ఆ పరమాత్మయందే లగ్నమైయుంటుంది గనుక అతడు ఆ పరమ పదాన్నే పొందుతాడు.

జ్ఞానము సర్వపాపాలనూ నశింపజేస్తుంది. మానవుణ్ణి పునీతునిగా చేయగల శక్తి, జ్ఞానానికి సరితూగ గలది, వేరొకటి లేదు. జ్ఞాన మనే నావను ఆశ్రయించి, మనుజుడు, సంసారమనే దుఃఖసాగరాన్ని సులువుగా దాటగలడు.

## 22. ఆత్మ

జీవరాశులయొక్క హృదయ గుహలలో ఉపస్థితమైయున్న పరమాత్మ యొక్క చైతన్యకిరణమే- ఆత్మ. దానినే జీవాత్మ అని కూడా అంటారు. ఈ ఆత్మ ఉపాధిని ధరించి, జీవుడు, దేహధారి, శరీరి, అనిపించుకొని, ఆ శరీరమే తానుగా భ్రమపడి, ఆ ఉపాధికి చెందిన కర్మబంధాలలో చిక్కుకొని కర్మఫల భోగాలు తనవిగా ఆరోపించుకొని, అనుభవిస్తుంది. కాని యథార్థంగా ఈ ఆత్మకు పుట్టుకలేదు, చావులేదు. ఒకప్పుడు ఉండి, మరిఒకప్పుడు లేకుండగపోదు. అది, పురాతనము, శాశ్వతము, సత్యము, నిత్యము, అయినట్టిది. శరీరము చంపబడినను, ఆత్మ చావదు. (2-20). దేహము నశించునట్టిది గాని, దేహి (ఆత్మ) అవినాశి, అప్రమేయుడు (ప్రమాణములచే నిరూపింప బడనివాడు) (2-18). ఈ జగత్తంతా నిండియున్న ఆత్మను ఎవ్వరూ అంతం చేయలేరు. (2-17). ఈ ఆత్మస్వరూపము, ఇంద్రియాలకు అగోచరము, మనస్సుకు అనూహ్యము; భూమి, నీరు, అగ్ని, వాయువులు, ఆత్మకు ఏవిధమైన క్షయం కలిగించలేవు. (2-23,24,25). ఆత్మ సర్వాంతర్యామి. సర్వసాక్షి.

## 23. ఓంకారము (ప్రణవము)

గిరాం అస్మి ఏకాక్షరం, (10-25), ప్రణవః సర్వవేదేషు (7-8) శబ్దాలలో, ఏకాక్షర పదం అయిన, ఓంకారమును నేను. వేదములయందలి సారమైన ఓంకారమును నేను. వేద్యం, పవిత్రం, ఓంకారం(9-17) తెలుసుకోదగిన పవిత్రమైన ఓంకార శబ్దాన్ని నేనే. అని భగవానుడే చెప్పాడు. ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మాం అనుస్మరన్, యః ప్రయాతి త్యజన్ దేహం, స యాతి పరమాం గతిం. (8-13) ఎవడు ఏకాక్షరమైన ఓంకారబ్రహ్మ నాదం చేస్తూ, నన్నే స్మరిస్తూ, దేహాన్ని విడిచి వెళ్తాడో అతడు పరమ గతిని పొందుతాడు. భగవానునిచే చెప్పబడిన ఈ వాక్కులు ఓంకారము యొక్క మహత్వాన్ని తెలియజేస్తున్నవి.

ఓంకారము సగుణ, నిర్గుణ, బ్రహ్మమునకు చిహ్నము. ఓంకారమే. బ్రహ్మము, ఉపాసనకు సర్వశ్రేష్ఠమైన ప్రతీకము ( ఆలంబనము, రూపము ). అకార, ఉకార, మకార, అర్థమాత్ర ( బిందు) తో కూడియున్న ఓంకారమును ఉచ్చరించే టప్పుడు- అకారమాత్రను ఉకారములోనూ, అకారఉకారాలను మకారములోనూ, అకార ఉకార మకారాలను అర్థమాత్రలోనూ లయింప జేసినట్లు భావించి, ఆ బ్రహ్మ నాదమంతా అమాత్ర మైనట్లు అనుభూతి పొందాలి. ఇదియే పరమప్రశాంత స్థితి ఒక ఓంకార నాదానికీ, తరువాతి ఓంకార నాదానికీ మధ్యను ఏర్పడే నిశ్శబ్ద ప్రశాంతతను గుర్తిస్తూ అనుభవిస్తుండాలి. ఈవిధంగా కొనసాగిస్తే, ఉపాసనాసిద్ధి లభిస్తుంది. ఓంకారాన్ని ప్రతీక మాధ్యమంగా ఉపాసిస్తే అది సగుణోపాసన, నాద- అధారంగా ఆరాధిస్తే అది నిర్గుణోపాసన అవుతుంది. సగుణోపాసకులు అర్చరాది మార్గాన బ్రహ్మలోకం వరకూ పోయి, క్రమముక్తిని పొందుతారు. శుద్ధ నిర్గుణోపాసకులు దేహాంత సమయంలో కూడ ధ్యానమగ్నులైయుండి, బ్రహ్మ పదాన్ని పొందుతారు.

నామరూప రహితమైన పరబ్రహ్మకు ఓం తత్ సత్ అను మూడు శబ్దాలతో నిర్దేశించడమయినది, ఉపాసనా సౌలభ్యం గురించి. ప్రతీ మంత్రానికీ ఓంకారం మొదట చేర్చబడుతుంది. ఓం తత్ సత్ అంటే- ఆ పరబ్రహ్మమే ఏకైక సత్యము. ( బ్రహ్మసత్యం, జగన్మిథ్య). ఓం తత్ సత్ శబ్దాన్ని భావయుక్తంగా ఉచ్చరిస్తే యజ్ఞ దాన తపః కర్మాచరణలో, లోపాలుంటే శమిస్తాయి.(17-23,24).

## 24. పరబ్రహ్మ స్థితిని పొందడానికి ఉత్తమాధికారి, ఎవరు?

నిర్మలమైన అంతఃకరణం కలిగియుండి, ధైర్యము, పట్టుదలలతో తనను తాను నియంత్రించుకొని, ఇంద్రియ విషయ భోగలాలసలను, రాగద్వేషములను వీడి, ప్రౌఢవైరాగ్యాన్ని ఆశ్రయించి, ఏకాంతవాసి, మితాహారి అయి, మనో,వాక్,కాయములను నిగ్రహించి, అహంకార మమకార బలదర్పాలనూ, కామక్రోధాలనూ, భోగ్య వస్తు పరిగ్రహమునూ త్యజించి సదా, ధ్యాన యోగపరుడై చిత్తశాంతిని పొందిన మహనీయుడు పరబ్రహ్మ స్థితిని పొందడానికి యోగ్యుడవుతాడు. (18-51,52,53).

## ౨౫. సాధన :-

బ్రహ్మమును తెలుసుకొన గోరువాడు బ్రహ్మ జిజ్ఞాసువు, ఆధ్యాత్మిక సాధనలను చేపట్టడానికి కావలసిన జిజ్ఞాస, అధ్యయనాసక్తి, అర్హతలూ, ఉన్నవ్యక్తిని అధికారి అంటారు. మోక్షాపేక్షకలవాడు ముముక్షువు. ముముక్షువు వర్జింపవలసినవి : కామము, క్రోధము, లోభము, పాపకర్మాచరణ, అభిజాత్య ధన విద్యా గర్వాలు. అతడు ఆచరింపవలసినవి సాధన చతుష్టయాలు :

***1.*నిత్యా నిత్య వస్తు వివేకము** : ఆత్మ నిత్యమైనది. తదితర వస్తు ప్రపంచమంతా అనిత్యమైనది అని తెలుసుకోవడం.

***2.* ఇహఅముత్ర ఫలభోగవైరాగ్యము** : ఇహలోక, పరలోక భోగాలపట్ల విముఖత

***3.* శమదమాది షట్కసంపత్తి :**

1. శమము అంటే అంతరింద్రియ నిగ్రహము.
2. దమము అంటే బహిరింద్రియ నిగ్రహము.
3. ఉపరతి : ఇంద్రియాలు విషయాలపై చరించకుండా, వాటిని వెనుకకు మరల్చడం.
4. తితీక్ష : సర్వదుఃఖాలనూ సహనంతో ఓర్చుకోవడం, భరించడం.
5. శ్రద్ధ : శాస్త్రాలయందు, గురువాక్యములందు, శ్రద్ధ, భక్తి విశ్వాసాలు కలిగియుండడం.
6. సమాధానము : బుద్ధిని లక్ష్యముపై ఏకాగ్రతతో నిలిపి యుంచడం.

***4.*ముముక్షుత్వము** : గాఢమైన మోక్షాపేక్ష కలిగియుండడం. ఈ సాధన చతుష్టయంతో పాటు, శ్రవణ మనన, నిదిధ్యాసలను అభ్యసించాలి.

శ్రవణ మంటే-వేదాంత శాస్త్రాది ఆధ్యాత్మిక విషయాలను, గురువులు, విజ్ఞులనుండి వినడం లేదా, భక్తి శ్రద్ధలతో అధ్యయనం చేయడం.

మననం అంటే-శ్రవణం చేసిన విషయాలగురించి పదేపదే ఆలోచిస్తూ ఉండడం.

నిదిధ్యాసనం అంటే- మననం చేయబడిన విషయంపై ఏకాగ్ర చిత్తంతో ధ్యానించడ౹. సమాధిస్థితికి నిదిధ్యాసనం ప్రారంభ దశ.

చిత్తశుద్ధిని సాధించడానికి, ఫలాపేక్షలేకుండా, శ్రద్ధతో యజ్ఞ దాన తపస్సుల నాచరించాలి. సాధన చతుష్టయం, శ్రవణాదులు, యజ్ఞ దానతపః కర్మలూ

ఆచరించడంచేత పూర్వకర్మలు నశించి, తత్త్వజ్ఞానం సిద్ధిస్తుంది. తత్త్వజ్ఞానం అంటే అద్వితీయ పరబ్రహ్మను గురించి ప్రత్యక్షంగ అనుభూతి చెందడం.

గీతలో చెప్పబడిన అనేక యజ్ఞాలలో శ్రేష్టమైనది బ్రహ్మయజ్ఞం. (స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞము). దానాలన్నిటిలోను, ఆధ్యాత్మజ్ఞాన దానం పరమ పుణ్యప్రదం. తపస్సు-శారీరిక, వాచిక, మానసిక-అని మూడు విధాలు. దేవ, గురు, బ్రాహ్మణులను, పెద్దలను సేవించడం, అహింస, శౌచం బ్రహ్మచర్యం మొదలైన నియమాలను పాటించడం, శారీరక తపస్సు. ఉత్తమ సంస్కారాన్ని ఆధ్యాత్మిక జ్ఞానాన్నీ వ్యక్తపరిచే వాక్కులను పలకడం, మృదుమధుర వాక్కులద్వారా అందరికీ ప్రీతిని కలుగ జేయడం, వాచిక తపస్సు. మనస్సును శుద్ధంగా నుంచుకొని, సర్వభూత హిత చింతనం చేస్తూ, ఎవ్వరి యడలనూ రాగద్వేషాదులు లేకుండా, నిగ్రహము. ఋజువర్తనము, సాత్త్విక ప్రవృత్తిని పాటించడం మానసిక తపస్సు, ఈ సాధనలను అభ్యసిస్తూ సగుణబ్రహ్మోపాసనచేస్తూ, క్రమంగా నిర్గుణ బ్రహ్మోపాసనకు ఎదగాలి. దాని ద్వారా బ్రహ్మజ్ఞానం లభిస్తుంది. నిర్గుణోపాసన పరిపక్వమవగా సవికల్పసమాధి, అనంతరం నిర్వికల్పసమాధి సిద్ధిస్తాయి. ఉపాసన అంటే అనేక సార్లు ఒక్క విధంగానే భావన చేయడం. అవిచ్ఛిన్న తైలధారవలె భావన చెయ్యాలి. మధ్యమధ్యను అన్యభావాలను చేరనివ్వ కూడదు. అన్నపానాది కార్యాలు చేస్తున్నా ఆ భావనను మనస్సునుండి జారిపోనివ్వరాదు. సద్గురు వాక్యమందు అచంచల విశ్వాసం ఉంచుకోవాలి.

## 26. ఉత్తమ కర్మయోగి లక్షణాలు

*ఉత్తమ కర్మయోగి :-*

1. కర్మ నాచరించడానికే తనకు అధికారమున్నది గాని, దాని యొక్క ఫలము నాశించుటకు లేదు అనీ, కర్మఫలాపేక్షతోనే, ఏ కర్మనూ చేపట్టరాదనీ, అట్లని కర్మచేయడం మానరాదనీ, తెలుసుకొని, ప్రవర్తిస్తాడు. (2-47).

2. తాను చేయవలసి యున్న కర్మను మిక్కిలి శ్రద్ధతోనూ, దానియందు వ్యామోహము (సంగము) లేకుండానూ, నిర్వహించి, కార్యము సిద్ధించినమా, సిద్ధింపకున్ననూ, సమబుద్ధినే కలిగియుంటాడు. (2-48).

3. భగవత్ ప్రీతికరమైన (లోక హితార్థమైన) కర్మ, బంధమును కలుగ జేయదు గనుక అట్టి కర్మలనే ఆచరిస్తుంటాడు. (3-9)

4. ఎప్పుడూ లోక శ్రేయస్సు కొరకే కర్మ చేస్తూ ఇతరులకు మార్గదర్శకంగా నుంటాడు. (3-21)

5. సమస్త కర్మలనూ, ఆశ, కోరికా, మమకారము లేకుండా, భగవదర్పణ భావంతో చేస్తూ యుద్ధం వంటి ప్రమాదకరమైన కార్యాన్ని కూడా, నిశ్చల మనస్సుతో, నైపుణ్యంతో నిర్వహించగలడు. (3-30)

6. నిష్కామ బుద్ధితో కర్మల నాచరించి, కర్మ ఫలాన్ని ఈశ్వరార్పణగా త్యజించి, కర్మబంధము నుండి విముక్తుడవుతాడు. (2-51)

7. ఇంద్రియాలను అదుపులో నుంచుకొని, కర్మ ఫలమందు ఆపేక్ష లేనివాడై, కర్తృత్వ భావం లేకుండా, చేయువలసియున్న కర్మలను నిష్ఠతో, నైపుణ్యంతో నిర్వహిస్తాడు. (3-7)

8. తన విద్యుక్త ధర్మాలను శ్రద్ధతోనూ, అసూయ లేకుండాను, నిర్వర్తిస్తాడు. (3-31)

9. అప్రయత్నంగా లభించిన దానితో సంతుష్టిని పొంది, ఎవ్వరియందూ ఈర్ష్య లేకుండా, శీతోష్ణాది ద్వంద్వాలకు అతీతుడై, కార్యసిద్ధి. అసిద్ధుల యందు సమభావం కలిగియుంటాడు. (4-22)

---

కర్మణ్యే వాధి కారస్తే, మాఫలేషు కదాచన।
మా కర్మ ఫలహేతు ర్భూః, మాతే సంగోఽస్తు అకర్మణి ॥ (2-47)
యోగస్థ కురుకర్మాణి, సంగంత్యక్త్వా ధనంజయ।
సిద్ధ్య సిద్ధ్యోః సమో భూత్వా, సమత్వం యోగ ఉచ్యతే (2-48)
యద్యనా చదాతి శ్రేష్ఠః, తత్తత్ ఏవేతరోజనః।
సయత్ ప్రమాణం కురుతే, లోక స్తదను వర్తతే ॥ (3-21)

## 27. ఉత్తమ యోగి యొక్క లక్షణాలు.

ఉత్తమ యోగి :-

1. పాపరహితుడై, నిశ్చల చిత్తుడై, ద్వంద్వాతీతుడై, స్థిర బుద్ధి కలిగిన వాడై, సర్వభూత హిత రతుడై యుంటాడు. (5-25)
2. కామక్రోధాదులను వీడి, మనస్సును జయించి, ఇతరుల సుఖదుఃఖాలను తనవిగానే భావించి, సర్వభూతముల యందునూ సర్వేశ్వరుడే ఉన్నట్లు గ్రహించి, భగవంతుని యందు మనసు నిలిపి, ధ్యానిస్తుంటాడు. (6-31)
3. ఇంద్రియ విషయాలందు, కర్మలయందు తగుల్కొనక, సర్వ సంకల్పాలనూ విడిచిపెడ్తాడు. (6-4)
4. జ్ఞాన విజ్ఞానములచే తృప్తి నొందిన వాడై, నిర్వికారుడై, ఇంద్రియాలను జయించినవాడై మట్టిగడ్డ, రాతిముక్క, బంగారపు ముద్దల పట్ల సమభావాన్నే కలిగి యుంటాడు. (6-8)
5. సహృదయులు, సాధుసజ్జనుల యందును, దుష్ట దుర్జనులయందును, శత్రు మిత్రులయందును, ప్రేమపాత్రులు, ద్వేషింపబడ దగిన వారియందును, పవిత్రులు పాపులయందును సమబుద్ధిని కలిగి యుంటాడు. (6-9)
6. ఎల్లప్పుడూ, నిర్జన ప్రదేశంలో ఏకాంతంగా నుంటూ, చిత్తమును వశము నందుంచుకొని, కోరికలు లేనివాడై, దేనినీ స్వీకరించని వాడై, ఆత్మయందే మనసు నిలుపుకొని యుంటాడు. (6-10)

## 28. ఉత్తమ భక్తుని యొక్క లక్షణాలు.

**ఉత్తమ భక్తుడు :**

1. సర్వ భూతములలో ఏ ఒక్కదాని యందు కూడా ద్వేషాన్ని కలిగియుండక, వాటి పట్ల మైత్రి, కరుణ జూపుతాడు. (12-13)
2. అహంకార మమకారాలు లేనివాడై, సుఖదుఃఖాల యందు సమభావం కలిగి యుంటాడు.
3. ఎల్లప్పుడూ సంతుష్టుడై యుండి, క్షమాగుణం కలిగియుంటాడు.
4. యోగ యుక్తుడై, మనోనిగ్రహం, దృఢ నిశ్చయం కలిగి యుంటాడు.
5. మనోబుద్ధులను భగవంతునికి పూర్తిగా సమర్పించి యుంటాడు.

6. నిష్కళంక చరిత్రుడవడం చేత, లోకులు నిందిస్తారని వ్యాకులం చెందడు, తాను లోకులకు ఏవిధమైన అలజడిని సృష్టించడు. (12-14)

7. హర్షము (అమిత సంతోషము) అమర్ష (క్రోధము), భయము, ఉద్వేగము మొదలైన మనోవికారాలు లేనివాడై యుంటాడు. (12-15)

8. దేనియందూ ఆపేక్షలేని వాడై, అంతర్ బహిర్, శుచికలవాడై, కార్యదక్షుడై, దేనియందూ వ్యామోహం లేనట్టి ఉదాసీనుడై, బాధలను తొలగించు కొన్నవాడై, ఫలాపేక్షతో కూడియున్న కార్యాలను చేపట్టని వాడై యుంటాడు (12-16)

9. ఎంత సంతోషం వచ్చినా ఉప్పొంగిపోడు, ఎవ్వరినీ ద్వేషించడు, దేనికీ శోకించడు, దేనినీ కోరడు. శుభాశుభ కర్మ ఫలాలను త్యజిస్తాడు (12-17)

10. శత్రుమిత్రులందూ, మా నావ మానాలయందూ, శీతోష్ణ సుఖదుఃఖాల యందూ సమభావం కలిగియుండి, దేనియందూ సంగము (వ్యామోహము) లేనివాడై యుంటాడు. (12-18)

11. స్తుతి, నిందలు, రెండూ అతనికి సమానమే. అతడు మౌనంగా ఉండే మనన శీలుడు. ప్రాప్తమైన దానితోనే సంతుష్టుడవుతాడు. స్థిరబుద్ధికలవాడు. గృహ దారాదుల యందు వ్యామోహము లేనివాడు. (12-19)

12. అతడు భక్తి యుక్తుడు, భగవంతుని యందు తప్ప అతనికి ఏ ఇతర విషయము పట్ల ఆసక్తి ఉండదు. అట్టివాడే భగవంతునికి మిక్కిలి ఇష్టుడు.

## 29. ఉత్తమ జ్ఞాని యొక్క లక్షణాలు.

**ఉత్తమ జ్ఞాని :-**

1. అనేక జన్మల సత్ సంస్కారాల ఫలితంగా జ్ఞానవంతులగు యోగుల వంశంలో పుట్టి, జ్ఞానవంతుడై, సర్వమూ వాసుదేవ మయమే అని తెలుసుకొంటాడు. (6-42, 7-19)

2. మిక్కిలి శ్రద్ధ కలవాడై, ఇంద్రియాలను సంయమించినవాడై, ఏకదీక్షతో జ్ఞానం కొరకు సాధన చేసి, జ్ఞానం పొందిన తరువాత పరమశాంతిని పొందుతాడు. (4-39)

3. విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని, గోవును, ఏనుగును, కుక్కను, కుక్కమాంసాహారినీ, అతడు సమదృష్టితోనే చూస్తాడు. (5-18)

4. అనురాగము, భయము, క్రోధములను పోగొట్టుకొని, పరమాత్మ యందే చిత్తాన్ని లగ్నం చేసి, జ్ఞాన తపస్సు చేత పవిత్రుడై యుంటాడు. (4-10)

5. అహంకారము, మోహము, సంగదోషము లేనివాడై, కామవర్జితుడై సుఖదుఃఖాది ద్వంద్వాల నుండి విముక్తుడై, ఆత్మజ్ఞాన నిష్ఠుడై యుంటాడు. (15-5)

6. స్వాతిశయము, అహంకారము, దంభము, అతనిలో ఉండవు. (13-8)

7. అహింస, క్షమాగుణం, ఋజుత్వము (సరళ వర్తనం), గురుసేవా తత్పరత, శుచిత్వము, స్థిరత్వము, ఆత్మ నిగ్రహము, ఇంద్రియ విషయాల యందు విరక్తి కలిగియుంటాడు. (13-9)

8. జన్మము, మృత్యువు, ముసలితనం, వ్యాధుల వలన సంభవించే దుఃఖాల గురించి సంపూర్ణమైన ఎఱుకను కలిగియుండి ప్రవర్తిస్తాడు.

9. దేనియందూ ఆసక్తిలేనివాడై, భార్యా, పుత్ర, గృహ, సంపదల యందు వ్యామోహము, తాదాత్మ్యత (వాటికి కలుగు కష్టనష్టాలు తనవిగానే భావించి, వ్యాకులం చెందడం) లేనివాడై, ఇష్ట, అనిష్టాలు సంభవించునప్పుడూ, ఎల్లప్పుడూ సమచిత్తాన్నే కలిగి యుంటాడు. (13-10)

10. భగవంతుని యందు అనన్య అచంచల భక్తిని కలిగియుంటాడు.

11. జనసందోహం ఉన్న స్థలాలను ఇష్టపడక, ఏకాంత వాసం కోరుకొంటాడు. (18-10)

12. తత్త్వ జ్ఞానము యొక్క ధ్యేయాన్ని గ్రహించిన వాడై, ఆధ్యాత్మజ్ఞాన నిత్యత్వాన్ని పొందుతాడు (అలవరచుకొంటాడు) (13-11)

## ౩౦. స్థిత ప్రజ్ఞుని లక్షణాలు.

స్థితప్రజ్ఞుడంటే స్థిరమైన జ్ఞానం కలవాడు అని అర్థం. అతడు :-

1. ఇహ, పర, లోకపు భోగాలు కావాలనుకొనేటట్టి కోరికలన్నిటినీ, మనసునుండి సమూలంగా తుడిచి పెట్టి, ఆత్మానందాన్నే అనుభవించ గోరుతుంటాడు. (2-55)

2. సుఖాలయందు వ్యామోహం పెంచుకోడు, దుఃఖాల పట్ల ద్వేషాన్ని చెందడు. దేనియందూ, అనురాగముగాని, కోపముగాని, భయముగాని, కలిగియుండడు. ప్రియముల పట్ల సంతోషమూ, అప్రియాల పట్ల ద్వేషమూ, దేనియందైననూ అభిమానమును పెంచుకోడు. (2-56,57)

3. ప్రమాదాన్ని శంకించగానే తాబేలు తన అవయవాలను ఏవిధంగా లోపలికి-లాక్కొని ముడుచుకొంటుందో, స్థితప్రజ్ఞుడు, తన ఇంద్రియాలను విషయాల వెంట చరించకుండా, ఆవిధంగానే, వెనుకకు మరల్చుకొని జాగ్రత్త పడ్తాడు. (2-58)

4. విషయ చింతనచే కోరికలు, కోరికల వలన క్రోధము, క్రోధం వలన మూఢత్వము, దాని వలన మతిభ్రమ, మతిభ్రమవలన విచక్షణా జ్ఞాన నాశము, బుద్ధినాశముచే సర్వనాశము, సంభవిస్తాయని తెలుసుకొన్న వాడై, అన్నింటికీ మూలకారణమైన విషయచింతనను, తన మనస్సు లోనికి ప్రవేశింపనివ్వడు. (2-62, 63)

5. సకల కర్మలను నిర్వహిస్తున్ననూ, తన మనస్సును స్వాధీనమునందు ఉంచుకొని, రాగద్వేషాలను రానివ్వకుండా, మనశ్శాంతిని పెంపొందించు కొని, సర్వదుఃఖాలను దూరంగా ఉంచుతాడు. (2-64, 65)

6. అదుపులో లేని మనస్సూ, ఇంద్రియాలూ కూడి, బుద్ధిని హరించి వేస్తాయి గనుక, అతడు వాటిని అతి మెలకువతో అరికట్టి ఉంచుతాడు. (2-67,68)

7. అటువంటి స్థితప్రజ్ఞుని యందు విషయాలు ప్రవేసించిననూ, అతనిని ప్రభావితం చేయలేవు, ఏలనన, అతడు, అహంకార, మమకార, ఆశా, కాంక్షలను వీడి, కోరికలన్నిటిని త్యజించి, యున్న వాడు గనుక, అతడు పరమశాంతిని పొందుతాడు. అదియే మోక్ష ప్రదమైన బ్రాహ్మీస్థితి. (2-71,72)

---

దుఃఖేషు అనుద్విగ్న మనాః సుఖేషు విగత స్పృహః
వీతరాగ భయక్రోధః, స్థిత ధీర్మని రుచ్యతే (2-56)

విహాయ కామాన్ యః సర్వాన్, పుమాంశ్చరతి నిఃస్పృహః
నిర్మమో నిరహంకారః, స శాంతి మధిగచ్ఛతి (2-71)

## 31. త్రిగుణములు.

సత్త్వగుణము రజోగుణము, తమోగుణము అనబడు త్రిగుణాలు, భగవంతుని మాయకు ప్రతిరూపమైన ప్రకృతి నుండియే ఉద్భవించాయి. ఇవి సృష్టి ఆది నుంచీ జీవరాశులను ఆవేశించి యున్నాయి. వీటి ప్రభావం నుండి తప్పించుకోడానికి త్రిమూర్తులకు కూడ సాధ్యపడదు. ఇవి, జీవుణ్ణి దేహానికి బంధించి ఉంచుతాయి. ఈ త్రిగుణాలు, ప్రతీ జీవియందు వివిధ అనుపాతాలలో (పాళ్లలో) కలిసియుంటాయి గనుక, వ్యక్తికీ వ్యక్తికీ మధ్య స్వభావ స్పందనలలో వ్యత్యాసం కనిపిస్తుంది. సత్త్వగుణం ఎక్కువగాను, రజోగుణ తమోగుణాలు అంతకన్నా తక్కువగానూ ఉండే వ్యక్తిని సాత్త్వికుడు, లేదా సత్త్వగుణ ప్రధానుడు అని అంటారు. అదే విధంగా, రాజసికుడు, తామసికుడు, పేర్కొన బడుతారు.

**సత్త్వ గుణము:-** ఇది స్వచ్ఛము, కాంతిమంతము, దోషరహితము అయినట్టిది. దీనివలన సుఖాసక్తి, జ్ఞానాసక్తి కలుగుతాయి. సత్త్వగుణాదిక్యతలో నున్నప్పుడు నిష్క్రమించు జీవి పుణ్యలోకాలను పొందుతుంది. సాత్త్విక శ్రద్ధకలవారు దేవతల నారాధిస్తారు. వారు రసవంతము, చమురు కలిగిన పుష్టికరమైన ఆహారాన్ని ఇష్టపడ్తారు. అది ఆయుస్సును, బుద్ధిబలమును, దేహబలమును ఆరోగ్య సుఖసంతోషాలను వృద్ధిచేస్తుంది. వారు, ఫలాపేక్షలేకుండా, ఇది నా కర్తవ్యం అనే భావంతో యజ్ఞాలు చేస్తారు. నియమ బద్ధులై, ఫలాశ లేకుండా చేయబడిన, శారీరిక మానసిక తపస్సులు సాత్త్వికమైనట్టివి. వీరు దేశకాలపాత్రములను గుర్తించి, ప్రత్యుపకార మ పేక్షించక, కర్తవ్యతా బుద్ధితో దానం చేస్తారు. రాగద్వేషాలకు లోనుగాక అభిమానమువీడి, ఫలమును త్యజించి, విధియుక్తముగ చేయబడినది సాత్త్విక కర్మ.

**రజోగుణము:-** ఇది రాగాత్మకము. దీని వలన ఆశ, లోభము, ఆసక్తి' భోగలాలస, మమకారము, తీవ్రమైన కార్యాచరణాప్రవృత్తి కలుగుతాయి. రజోగుణాధిక్యతలో నున్నప్పుడు నిష్క్రమించు జీవి కర్మాసక్తిగల మానవజాతిలో భూలోకంలో జన్మిస్తుంది. రజోగుణ కర్మ ఫలితము దుఃఖము. రాజసికులు యక్ష రాక్షసులను ఆరాధిస్తారు. వీరికి అమితముగ ఉప్పు, పులుపు, కారము, కలిగినవియు, చేదుగ నున్నవియు, మిక్కిలి వేడిగ నున్నవియు, ఉద్రేకం కలిగించునవియు, కడుపు మండునవియు, దాహము పుట్టించునట్టివియు నగు, ఆహారాలు ఇష్టము. ఇవి దుఃఖము, రోగము కలిగిస్తాయి. వీరు ఫలాపేక్షతోను, ఆడంబరంగాను యజ్ఞాలు

చేస్తారు. ఇతరులనుండి బహుమతులను, గౌరవమును, పూజలను, పొందగోరి, ఆడంబరముగ చేయబడే తపస్సు, రాజసిక తపస్సు. ఇది చంచల అస్థిరఫలము నిచ్చు నట్టిది. ప్రత్యుపకారము నాశించి మనసు కష్ట పెట్టుకొని చేసినదానము రాజసిక దానము, ఫలాపేక్షతోనూ, అహంకారముతోనూ, అనేక శ్రమలతోనూ చేయబడిన కర్మ రాజసిక కర్మ.

**తమోగుణము** :- ఇది అజ్ఞానాత్మకం. నిద్ర, సోమరితనం, భ్రమ, పరాకులను పెంచి, పనిచేయడానికి ఇష్టపడకుండడం, పొరపాట్లు చేయడం కలిగిస్తుంది. తమో గుణాధిక్యతలో నున్నప్పుడు జీవి నిష్క్రమిస్తే మూఢ యోనిలో జన్మించి అధో లోకాలకు పోతుంది. తామసికులు, చాలా నిలువ ఉన్నట్టివి, పాచి పట్టినవి, వండి ఒక జాము దాటినవి, ఎంగిలివి, అపవిత్రమైనట్టివీ, అయిన ఆహారాన్ని తినడానికి ఇష్టపడ్తారు. శాస్త్ర విరుద్ధముగను మంత్రపఠనముచేయకను అన్నదానము, దక్షిణలు, ఇవ్వకను, అశ్రద్ధతోను చేయబడిన యజ్ఞము తామసికమైనట్టిది. విపరీత భావన చేత తనకు బాధ కలుగునట్లుగాని, పరులకు ఉపద్రవము కలిగించడానికి గాని చేయబడిన తపము తామసికము. దేశకాల పాత్రములను గమనించక, అగౌరవముగాను, అవమాన పూర్వకముగాను చేయు దానము తామసికము. తన శక్తిసామర్థ్యాలను గమనించక, హింసాత్మకము హానికరము అని సరకుజేయక, దుఃసాహసముతో చేయబడిన కర్మ తామసిక కర్మ. వివేకమూ, కట్టుబాట్లూ లేకుండా, పొగరు బోతుగా, ప్రవర్తిస్తూ, పరహిత భంగము చేస్తూ, సోమరి, చింతా క్రాంతుడై, అన్నింటినీ అనవసరంగా పొడిగిస్తూ ఉండేవాడు తామసిక కర్త అనబడుతాడు. అధర్మమును ధర్మముగాను, ధర్మమును అధర్మముగాను, ప్రతీవిషయాన్నీ విపరీతంగా అర్థం చేసుకొనే బుద్ధి తామసిక బుద్ధి.

ఈ మూడు లోకాల్లోనూ, ఈ త్రిగుణాలతో కూడి యుండనిది ఏదీలేదు. (18-40).

---

సత్త్వాత్ సంజాయతే జ్ఞానం, రజసో లోభ ఏవచ ।
ప్రమాదమోహౌ తమసః, భవతో (అ) జ్ఞానమేవచ ॥ (14-17)
సమదుఃఖ సుఖః, సమలోష్టాశ్మ కాంచనః ।
తుల్యప్రియా ప్రియో ధీరః తుల్యనిందాత్మ సంస్తుతిః ॥
మానావ మాన యోస్తుల్యః, తుల్యో మిత్రా రిపక్షయోః ।
సర్వారంభ పరిత్యాగీ, గుణాతీతః స ఉచ్యతే ॥ (14-24,25)

*త్రిగుణాతీతుడు :-*

ఎవడు, తనకు సంప్రాప్త మయిన సత్త్వగుణ ప్రకాశమునుగాని, రజోగుణ కర్మ ప్రవృత్తిని గాని, తమోగుణ మోహమును (నిద్రా తంద్రతలను) గాని, ద్వేషింపడో, ఉన్నది వద్దని గాని, లేనిది కావాలని గాని, కోరక, తటస్థముగ నుండి మనశ్చాంచల్యమును అణచి, దేనియందూ ఆసక్తిలేక, సుఖదుఃఖములు, ప్రియాప్రియములు, నిందాస్తుతులు, మానావమానాలు, శత్రుమిత్రత్వాలు, మొదలైన ద్వంద్వాలలో సమచిత్తుడై, ధైర్యముతో స్వస్థచిత్తుడై, బంగారము, రాయి, మన్ను మొదలైన వాటియందు భేదమెంచక, తనకుతానై ఏ కామ్యకర్మనూ ప్రారంభింపక, కర్తవ్యమును మాత్రము, చక్కగ నిర్వహిస్తుంటాడో, అతడు గుణాతీతుడు అనబడుతాడు (14-22-25)

దేహోత్పత్తికి హేతువులగు ఈ మూడు గుణాలను అతిక్రమించి, దేహి, జనన మరణ జరాదుఃఖాలతో నిండియున్న సంసారం నుండి ముక్తుడై మోక్షాన్ని పొందుతాడు.

## 32. దైవీగుణ సంభవులు.

సృష్టిలో దైవీ సంపద వారు, ఆసురీ సంపదవారు అను రెండు తెగలున్నారు. దైవీ సంపదతో పుట్టిన వారికి సహజముగ కలిగే సుగుణాలివి :

సత్త్వగుణ విశిష్టత, జ్ఞాన యోగ నిష్ఠ, నిర్భయత్వము, దానము, ఇంద్రియ నిగ్రహము, భగవదారాధన, స్వాధ్యాయము, తపస్సు, ఋజుత్వము, అహింస, సత్యము, కోపము లేకుండడం, స్వార్థ త్యాగము, శమము, ఉపరతి వలన కలిగే చిత్తశాంతి, పరులదోషాలను ఎంచే నీచగుణం లేకపోవడం, విషయ లంపటత్వం లేకుండటం, మృదుత్వము, అణకువ, చిత్తచాంచల్యం లేకుండటం, తేజస్సు, క్షమ, ధైర్యము, బాహ్య అంతరంగిక శుచిత్వము, ద్రోహచింతన లేకుండటం. దురభిమానం లేకుండటం. (16-1,2,3)

## 33. ఆసురీ గుణ సంభవులు.

ఆసురీ సంపదతో పుట్టిన వారి సహజ గుణాలు ఈ విధంగా ఉంటాయి. అజ్ఞానము, ఆడంబరము, పొగరుబోతుతనము, గర్వము, క్రోధము, కాఠిన్యము, వీరికి స్వాభావికాలు. వారి ఆలోచనలు, ప్రవర్తనలు ఇలా ఉంటాయి (16-4)

స్త్రీ పురుష సంయోగము చేతనే ఈ జగత్తంతా పుట్టింది గాని, ఈశ్వరుడు గాని, వేరే ఏ కారణముగాని, లేదు, అని అంటారు. ప్రపంచ వినాశకరమైన భయంకర కృత్యాలు చేస్తుంటారు. తనివి తీరని కామతృష్ణలో కొట్టుకొంటూ, మిథ్యా సిద్ధాంతాల నాశ్రయిస్తూ, చెడు పట్టుదలతో, అహంకార గర్వమదాలతో అవినీతి పరులై మెలగుతారు. కామోపభోగము తప్ప జీవిత పరమార్థం ఏదీలేదని నమ్మినవారై, వారు దాని కొరకే ఏదో ఒక విధంగా అన్యాయ ధనార్జన చేస్తూ, ఆశాపాశాలచే కట్టబడి, కామక్రోధాలకు బానిసలై, జీవించి యున్నంత కాలమూ, అంతులేని చింతలపాలై కొట్టుకుంటారు. ఇంకా, వారి ఆలోచనలు ఇలా ఉంటాయి: నేడు నావద్ద ఇంత ధనమున్నది. ఇంకా మరింత చేరాలి. నా శత్రువులు ( ప్రత్యర్థులు) ఇంకా కొందరు మిగిలి యున్నారు. వారిని కూడా జయించి అణచివెయ్యాలి. నేనే బలవంతుడను, సుఖవంతుడను, ధనవంతుడను, ప్రభువును, నాకు సమానుడు ఇంకెక్కడున్నాడు ? ఈ విధమైన మోహజాలములో తగుల్కొని, అహంకార ధనమద గర్వితులై, దైవద్వేషులై ఆసురీ యోనులందే జన్మిస్తూ, జన్మజన్మకూ మూఢత్వం వృద్ధికాగా, అధోగతికే దిగజారిపోతుంటారు. (16- 7నుండి 20)

---

అభయం సత్త్వ సంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయః స్తప ఆర్జవం ॥

అహింసా సత్య మక్రోధ : త్యాగః శాంతి రపైశునం ।
దయా భూతేషు, అలోలత్వం, మార్దవం, హ్రీర్ అచాపలం ॥

తేజః క్షమా ధృతిః శౌచం, అద్రోహో, నాతిమానితా
భవంతి సంపదం దైవీం, అభిజాతస్య భారత ॥ (16-1 నుండి 3)

దంభోదర్పో (అ) భిమానశ్చ, క్రోధః పారుష్యమేవచ
అజ్ఞానం చాభిజాతస్య, పార్థ ! సంపద మాసురీం (16-4)

## 34. సమత్వము

భగవద్గీతలో చెప్పబడిన ఉత్తమ కర్మయోగి, రాజయోగి, భక్తుడు, జ్ఞాని, స్థిత ప్రజ్ఞుడు, గుణాతీతుడు, దైవీగుణసంపన్నుడు మొదలైన వారందరికీ ఉండవలసిన కొన్ని ముఖ్య లక్షణాలు, వారికే కాకుండా, ఆధ్యాత్మిక సాధకులకూ, జీవన సమర సైనికులకూ కూడా, అత్యంత ఆవశ్యకములే. అవి :

1. అహంకార మమకారాలను తొలగించడం. అహంకారం అంటే ''నేనే'' గొప్పవాణ్ణి. అన్నీ చేయించేవాణ్ణి. అందరూ నేను చెప్పినట్లే చెయ్యాలి, అనే భావం. మమకారం అంటే-నాది, నావారు-నాకు కావలసినదంతా నాదే అవాలి-అనుకొనే తత్త్వం. ఈ ఇద్దరూ మానవునకు జంట శత్రువులు, అన్ని అనర్థాలూ తెచ్చిపెట్టేవారు. వీరిని నొక్కిపెట్టి ఉంచాలి, సాధ్యమైతే నిర్మూలించాలి.
2. కామ, క్రోధ, లోభాలను చేరనివ్వక పోవడం. ఇవి కూడ, అహంకార మమకారాలకు తోడుదొంగలే. కామం అంటే ఒక కోరికల ఊట. దానికి సహాయకారి-లోభం. లోభం-తనేకే ఇంకా అన్నీ కావాలి, తనకున్నది తనకే చాలదు, ఇతరులకేమీ ఇవ్వడం అవదు-అనిపిస్తుంది. తాను కోరిన వస్తువు కావలసినంతగా లభ్యం అవకపోతే క్రోధం వస్తుంది. ఈ ముగ్గురూ కూడి, మానవుని అమూల్యమైన మనశ్శాంతిని తస్కరిస్తారు. లోభులు, ముందు జన్మలలో దరిద్రులౌతారు.
3. ఇంద్రియ నిగ్రహం అంటే పంచేంద్రియాలైన చెవులు, కన్నులు, ముక్కు, నాలుక, చర్మమూ, వాటి యొక్క విషయాలైన శబ్ద, రూప, గంధ, రస, స్పర్శ సుఖాల వెంట విచ్చల విడిగా చరించకుండా, అదుపులో నుంచుకోవడం. లేకుంటే, అవి కళ్లెములేని గుర్రాల వలె, మనస్సును, బుద్ధిని ఏటో లాక్కొని పోయి పతనం చేస్తాయి.
4. మనోనిగ్రహం అంటే మనస్సును నియమించడం. ఇంద్రియాలకు అధినేత మనస్సు. ఈ మనస్సే మానవునికి బంధముగాని, మోక్షముగాని, తెచ్చిపెట్టు నట్టిది. మనస్సును నియమించి, సన్మార్గంలో వర్తింప జేస్తే, సకల శుభాలూ చేకూరుతాయి.

5. **అసంగము (సంగరాహిత్యము)** : సంగము అంటే దేని యందైనా ప్రగాఢ వ్యామోహం కలిగియుండడం- అది లేకపోతే నేనుండలేను - అని నమ్మడం. ఇలాంటి అనురక్తి లేకపోవడాన్ని సంగరాహిత్యం అంటారు. ఈ సంగమే మానవుని ప్రగతికి అడ్డుగోడ అవుతుంది.

6. **అనాసక్తత** : దేనియందూ ఆపేక్షలేకుండడం. ప్రియమైన ప్రతీదీ తనకు కూడా ఉంటే బాగుండును అనుకోవడం, ఆసక్తి. ఇది కామ, క్రోధ, లోభాలకు దారితీసి, పడగొడ్తుంది.

7. **సంతుష్టి** : లభించిన్న దానితో తృప్తి జెందడం. సాధకులు, తాము కోరకుండానే, అప్రయత్నంగా లభించిన దానిని భగవత్ ప్రసాదంగా స్వీకరిస్తారు. ఇదియే సర్వజనులూ పాటించవలసిన ఉత్తమ నీతి. సంతుష్టి కలవాడు సకల సౌభాగ్యవంతుడు. అదిలేని వాడు ఎంతటి సంపన్నుడయినా, దరిద్రుడే.

8. **శౌచము** : బాహ్యశుచియే కాకుండా, అంతఃశుద్ధి ఎంతో అవసరం. అంతః శుద్ధి అంటే, మనసూ, బుద్ధీ-కామక్రోధాదులతోనూ, రాగద్వేషాదులతోనూ, అలజడి అశాంతులతోను, కలుషితం కాకుండా కాపాడు కోవడం.

9. **సర్వభూత హితం కోరడం** : సర్వేశ్వరుడు, సర్వ భూతాంత రాత్మ అయి యున్నందున సర్వభూతసేవ సర్వేశ్వర సేవగా గ్రహించి ప్రవర్తించడం.

10. **అహింస** : ఎవ్వరినీ, శారీరికంగానే కాకుండా, మానసికంగాను, వాక్కులతోనూ, హింసించకుండడం.

11. **క్షమాగుణం** : ఇతరుల తప్పిదాన్ని సహృదయతతో మన్నించడం.

12. **నిశ్చల చిత్తము** : సుఖాలు వస్తే పొంగిపోకుండా, కష్టాలలో కృంగిపోకుండా, చిత్త చపలత లేకుండా ఒడిదుడుకుల్లో చిత్తస్థైర్యాన్ని నిలుపు కోవడం.

13. **ద్వంద్వాతీతము** : ద్వంద్వాలంటే- శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, శుభాశుభాలు, లాభనష్టాలు, మానావమానాలు, రాగద్వేషాలు, ప్రియాప్రియాలు, నిందా స్తుతులు, జయాపజయాలు, ఆనంద ఆవేదనలు, సిద్ధి అసిద్ధులు, మిత్రశతృత్వాలూ మొదలైన అనుకూల వ్యతిరేక అనుభావాలు. వాటియొక్క తాకిడికి చలించకుండ, వాటికి అతీతంగా ఉండగలగడం ద్వంద్వాతీతం అనబడుతుంది.

*14.* సమత్వం: ఇది ఒక గొప్ప సాధన. సమత్వమూ ఒక యోగమే అని భగవానుడే చెప్పాడు (2-48). ద్వంద్వాల పట్ల సమత్వాన్ని సాధించిన వ్యక్తికి ఆధ్యాత్మిక రంగంలోనే కాకుండా, వ్యావహారిక జగత్తులో కూడా, అంతా ప్రశాంతత, ఆనందమే, ప్రాప్తిస్తాయి. భగవానుడు ఇలా చెప్పాడు : అర్జునా ! విషయాలతో ఇంద్రియాలు సంపర్కించునప్పుడే శీతోష్ణాది అనుభవాలు కలుగుతాయి. ఈ సంయోగ వియోగాలు తెచ్చిపెట్టే అనుభవాలు ఎల్లప్పుడూ నిలిచేవికావు, వస్తూ పోతూ ఉంటాయి. అందుచేత వీటిని సమభావంతో ఓర్చుకోవాలి. (2-14,15). సమబుద్ధిని కలిగి, నీ విద్యుక్త ధర్మమైన యుద్ధంవంటి ఘోర కర్మను చేసినా, నీకు పాపం అంటదు (2-38) ఇదియే కర్మాచరణలోని నైపుణ్యము (2-50). వివేకవంతుడు సుఖాల యందు ఆసక్తి జూపడు దుఃఖాలకు చలించిపోడు, అనురాగము, భయము, క్రోధములకు లోనుకాడు (2-56) ప్రియముల పట్ల సంతోషము, అప్రియాలపట్ల ద్వేషము చెందడు (2-57) అహంకార మమకార, ఆకాంక్ష కోరికలను త్రోసి పుచ్చుతాడు (2-71). విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణుని యందూ, గోవు, ఏనుగు, కుక్క, కుక్కమాంసాహారి యందూ, జ్ఞాని, సమదృష్టినే కలిగియుంటాడు (5-18) అలాంటి సమదర్శనుడు జీవన్ముక్తు డవుతాడు (5-19) ఉత్తమ యోగి, శీతోష్ణ సుఖదుఃఖ మానావ మానాల యందూ, మట్టి గడ్డ రాతిముక్క బంగారపు ముద్దలయందూ, సమబుద్ధిని కలిగియుంటాడు. అతనికి స్నేహితులు, పరిచితులు, మధ్యస్థులు, శత్రువులు, పాపులు సాధుసజ్జనులు, అందరూ సమానులే (6-7,8,9) అర్జునా! ద్వంద్వాలను అధిగమించి, సంగమును వీడి, లభించిన దానితో సంతుష్టుడైనట్టి సమబుద్ధిని కలిగిన భక్తుడు నాకు మిక్కిలి ఇష్టుడు (12-17,18,19). ఇంకా అనేక సందర్భాలలో భగవానుడు ఈ సమత్వ యోగాన్ని కొనియాడాడు.

## 35. శరణాగతి.

శరణాగతి అంటే, సర్వమూ తానె అయియున్న సర్వేశ్వరునికి, భక్తుడు నీవే తప్ప నితః పరంబెరుగ- అనీ, నినువినా బ్రోచేదెవరు రా- అనీ అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ- అని, తనయొక్క తను, మన, ధన, ప్రాణ, సర్వస్వమూ

అర్పించి నిశ్చింతుడై యుండడం. దీనినే వేదాంతంలో మార్జాల కిశోర న్యాయం అంటారు- పిల్లి తన చిన్న పిల్లలను, పెరిగే వరకూ, తన నోట కరచుకొని తీసుకెళ్ళి, తిప్పుతుంది. ఇది భక్తి మార్గంలోని చరమ దశ.

జ్ఞానులు -సర్వం ఖల్విదం బ్రహ్మ (సమస్తమూ ఆ బ్రహ్మమే) అనీ, రెండవదంటూ ఏదీలేదు అని దేనిని వర్ణిస్తారో, దానినే భక్తులు, వాసుదేవః సర్వం ఇతి అంటారు. ఆయననే- ''త్వమేవ మాతాచ పితాత్వమేవ, త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ, త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ, త్వమేవ సర్వం మమదేవ దేవ'' అని ఆరాధిస్తారు.

గీతలో భగవానుడు చేసిన చివరి ఉపదేశం కూడ ఇలాగుంది :

***మన్మనాభవ మద్ భక్తో, మద్యా జీ మాం, నమస్కురు।***
***మామేవైష్యసి సత్యం తే, ప్రతి జానే, ప్రియో (అ)సిమే॥ (18-65)***
***సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ।***
***అహం త్వా సర్వ పాపేభ్యో మోక్ష యిష్యామి, మాశుచః॥ (18-66)***

అర్జునా! నాపై మనసు నిలుపుము. నాయందు భక్తి కలిగియుండుము. నన్ను ఆరాధింపుము. నాకు నమస్కరింపుము. నీవు నన్నే పొందగలవు. నీవు నాకు ప్రియతముడవు గనుక నేను నీకు ఈ సత్యాన్ని చెప్తున్నాను. దేహ మనో బుద్ధుల యొక్క సమస్త ధర్మాలనూ విడిచిపెట్టి, నన్నే శరణు పొందుము. నేను నిన్ను సమస్త పాపాలనుండి విముక్తుణ్ణి చేస్తాను. శోకింపవద్దు.

అన్ని ఉపాసనా మార్గాలలో భక్తి మార్గమే సులువైనది అని అంటారు. దీనికి పాండిత్యమూ, శాస్త్రజ్ఞానమూ అవసరంలేదు. ప్రేమతో ద్రవించే ఆర్ద్ర హృదయం ఉండాలి. శరణాగతి, దానికంటే సులువైన మార్గమంటారు. సర్వమూ అర్పణ చేసి, నాదేమీ లేదు, అంతా నీదే అనీ, నేనేమీ కాను, అంతా నీవే అనీ-సంపూర్ణంగా విశ్వసించడం, వ్యవహరించడం దీనిమూల సూత్రం. అయితే, అది ఎంతో సాధన చేత గాని, సిద్ధించదు. మధ్యమధ్యను అనేక సంశయాలు, పూర్వ సంస్కారాలు. అహంకారమూ అడ్డు వస్తుంటాయి. అయినా భక్తుడు నిరుత్సాహ పడడు. అనన్య చింతయే ఏకైక సాధన.

**36 మోక్షము.**

పరమాత్మ యొక్క చైతన్య కిరణంగా ఉపాధిని ప్రవేశించిన జీవాత్మ, ఉపాధితో తాదాత్మ్యాన్ని పొంది, తానే కర్తను, భోక్తను, అని భావిస్తూ, సంసార చక్రంలో పరిభ్రమిస్తూ ఉండగా, సత్కర్మ సంస్కార ఫలితంగా జ్ఞానం కలిగి, ఉపాధితో తాదాత్మ్యాన్ని వీడి, అహం బ్రహ్మాస్మి - నేనే బ్రహ్మమును అను ఎరుక కలిగిన తత్ క్షణమే పరమాత్మను చేరిపోతుంది. దీనినే మోక్షమంటారు. ముక్తి అంటారు.

ముక్తి మూడు విధాలు - క్రమముక్తి, జీవన్ముక్తి, విదేహముక్తి అని. క్రమముక్తి అంటే, ఉపాసకుడు చనిపోయిన తరువాత, తన ఉపాసనా ఫలంగా, దేవయాన మార్గాన, బ్రహ్మలోకాన్ని చేరి, అక్కడ కల్పాంతం వరకూ ఉంటూ, కల్పాంతంలో బ్రహ్మదేవునితోపాటు, పరమాత్మ యందు లీనమవడం. జీవన్ముక్తి అంటే, బ్రహ్మజ్ఞానం కలిగినప్పటికీ, ప్రారబ్ధకర్మ వశాన, లోకాను సారంగా వర్తిస్తూ అసంగుడై యుండడం. విదేహముక్తి అంటే, దేహపతన అనంతరం కలిగే నిర్విశేష బ్రహ్మైక్య స్థితి. నిర్గుణ బ్రహ్మోపాసకులు కృతకృత్యులైతే మోక్షాన్ని పొందుతారు. సగుణ బ్రహ్మోపాసకులు అర్చిరాది ( దేవయాన) మార్గాన బ్రహ్మలోకానికి వెళ్తారు. దానినే వైష్ణవులు వైకుంఠమనీ, శైవులు కైలాసమనీ, రామభక్తులు సాకేతమనీ, కృష్ణభక్తులు గోలోకమనీ అంటారు.

గీతలో భగవానుడు ఇలా చెప్పాడు : అర్జునా! అనేక వేలమంది మనుష్యులలో ఏ ఒక్కడో మోక్షసిద్ధికై యత్నిస్తాడు. అట్టి యత్న శీలురలో ఏ ఒక్కడు మాత్రమే నన్ను వాస్తవముగ తెలుసుకోగలుగుతాడు (7-3), అవసాన కాలమందుకూడ, ఎవడు నన్నే స్మరించుచు దేహమును వీడునో, అతడు నిస్సందేహముగ నన్నే పొందును. ఎవడు ఏ భావమును స్మరించుచు, దేహమును వీడునో, ఆ భావ సంబంధమైన రూపమునే పొందును. (8-5,6). నన్ను పొందిన వారు, పునర్జన్మల దుస్థితిని ఇక పొందరు . బ్రహ్మలోకం వరకుగల లోకాలన్నీ మరల మరల సంభవించు నట్టివి. కాని, నన్ను పొందిన వారికి మాత్రము పునర్జన్మ ఉండదు. (8-15,16)

## 37. దైనందిన జీవితంలో గీతా జ్ఞానం ఎలాగ ఉపయోగపడ్తుంది ?

***37.1* వ్యాకుల పాటు, దిగులు, నిరుత్సాహం ఆవరించినప్పుడు :-**

''కుతస్త్వా కశ్మల మిదం, విషమే సముప స్థితం (2-2), క్షుద్రం హృదయ దౌర్బల్యం, త్యక్త్వా, ఉత్తిష్ఠ పరంతప (2-3)- ఇలాంటి సంకట స్థితిలో, నీకు ఈ వ్యాకుల పాటు ఎలాగ దాపురించిందయ్యా ! క్షుద్రమైన ఈ హృదయ దౌర్బల్యాన్ని పారద్రోలి, లే, లేవయ్యా శత్రుభయంకరా!'' అని అర్జునునకు ఉత్తేజపరచిన భగవానుని ఆదేశాన్ని జ్ఞాపకం చేసుకోవాలి.

***37.2.* ప్రతిచిన్న విషయానికీ విచారిస్తూ కూర్చుంటాం. అప్పుడేం చెయ్యాలి ?**

అది మన అవివేకాన్నీ, హృదయ దౌర్బల్యాన్నే సూచిస్తుంది. విచారిస్తూ కూర్చోవడం వలన సమస్య పరిష్కారం అవదు సరికదా, మన ఆలోచనాశక్తి కూడా సరిగా పనిచేయకుండా పోతుంది. తప్పుడు నిర్ణయాలకు దారితీస్తుంది. శోకించి, చేయగలిగిందేమిటి ?''అశోచ్యా నన్వశోచస్త్వం (2-11) నాయనా! శోకింపరాని విషయాల గురించి నీవు శోకిస్తున్నావు. ఇది బుద్ధిమంతుల లక్షణం కాదు'' అని చెప్పిన భగవానుని వాక్కు మననం చేసుకొని, ఉత్తిష్ఠ! లేచి నిల్చోవాలి.

***37.3* త్రీవసమస్యలు ఎదురైనప్పుడు, ఏమి చెయ్యాలో తోచనప్పుడు ఏమి చెయ్యాలి?**

శక్తి వంచన లేకుండా ప్రయత్నించాము, బుద్ధి బలమంతా ఉపయోగించాము. మానవప్రయత్నం అంతా చేసిన తరువాత ఇక మిగిలినది ఆ దేవుని శరణు వేడడమే కదా! అర్జునుడు కూడా అలాగే చేశాడు :

''కార్పణ్యదోషోప హతస్వభావః, పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢ చేతాః
*యత్ శ్రేయః శ్యాన్నిశ్చితం బ్రూహితన్మే శిష్యస్తేహం, శాధిమాం, త్వాం ప్రపన్నం (2-7)*

తీవ్రమైన మమకారప్రలోభంచే, ధర్మాధర్మ విచక్షణను కోల్పోయి వేడుతున్నాను. ఏది శ్రేయస్కరమో నిశ్చయించి చెప్పు ప్రభో ! నీ శిష్యునిగా నేను నీ శరణుజొచ్చాను''. అన్నాడు. మనం కూడా అలాగే వేడుకొంటే తప్పకుండా మార్గం కనబడుతుంది.

***37.4.* సుఖాలు సంభవించు నప్పుడు హాయిగానే ఉంటుంది గాని, కష్టాలలో మాత్రం బాబోయ్ భరించలేం అనిపిస్తుంది. ఏమి చెయ్యాలి ?**

సుఖ దుఃఖాలు నాణెం యొక్క బొమ్మా బొరుసు లాంటివి. రెండూ కలిసే వస్తాయిగాని, విడిగా లభ్యం అవవు. అసలు ఇవి ఎలాగ సంభవిస్తుంటాయో

తెలుసుకొంటేవాటి ప్రభావం మనమీద అంతగా ఉండదు. భగవానుడు ఏమిచెప్పాడు?

*''మాత్రా స్పర్శాస్తు కౌంతేయ, శీతోష్ణ సుఖ దు:ఖదా।*
*ఆగమా పాయినోఽ నిత్యాః తాంస్తితిక్షస్వ భారత॥* (2-14)

అర్జునా ! ఈ శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వ అనుభవాలు, ఇంద్రియాలు, విషయాలతో సంపర్కించడం వలననే కలుగుతుంటాయి. అవి, ( ఆగమ, ఆపాయిన, అనిత్య) వస్తాయి, వెళ్తాయి, అట్టేకాలం ఉండనట్టివి. కావున వాటిని ఓర్చుకోవాలి''. సుఖదుఃఖాలు ఒకదాన్నొకటి తరుముకొంటూ, మానవుని జీవితంలో దాగుడు మూతలాడు కొంటాయి. ఏదీ స్థిరంగా ఉండిపోదు. ఈ పరమ సత్యాన్ని గ్రహించిన వ్యక్తి సుఖాలు వస్తే పొంగిపోడు కష్టాలలో కృంగి పోడు. తితీక్ష వహిస్తాడు. ఆగమ, ఆపాయిన, ఆనిత్య, జ్ఞాపకం ఉంచుకోవాలి.

## *37.5 ఆత్మీయులు గతించి నప్పుడు, శోకంతో, ఈ ప్రపంచమే శూన్యం అయిపోతుంది. ఎందుచేత ?*

దేనియందైనా, ఎవరి యందైనా ప్రగాఢ సంగము, అమితమైన మమకారము ఏర్పడి యున్నప్పుడు వియోగం కలిగితే తీవ్రమైన శోకం కలుగుతుంది. సరియైన జ్ఞానం వలన, మనిషికి మనిషికి మధ్యనున్న సంబంధాల యధార్థ తత్త్వము తెలిసిన తరువాత, శోకం కలిగినా త్వరలోనే వీడి పోతుంది. ప్రతీ జీవికి, స్థూలదేహము, సూక్ష్మదేహము, కారణదేహము, ఉంటాయి. స్థూలదేహము పంచభూతాలతో ఏర్పడిన జడ ఆకారము. జీవునితో సహా సూక్ష్మకారణ శరీరాలు, స్థూలశరీరాన్ని విడిచి వెళ్లినప్పుడు, జడ శరీరం పతనమవుతుంది. దానినే మరణమంటారు (16.1 ఆత్మను గురించి వ్రాయబడిన వివరాలు చూడుడు) అయితే, మనప్రియతమ వ్యక్తి ఆ జడ శరీరమా? కానప్పుడు మరిదేని గురించి ఏడ్వడం? జీవునకు చావులేదు. అనేక మాతృగర్భాల్లో ప్రవేశించి, అనేక దేహాలను ధరిస్తాడు, వాటిలో మనకు తెలిసిన దేహం ఇది. సృష్టింప బడిన ప్రతీ వస్తువూ నశించేటట్టిదే. ''అంత వంత ఇమే దేహా, నిత్య స్యోక్తాః శరీరిణః (2-18) ఈ దేహాలన్నీ అంతమయ్యే స్వభావం కలవియే, కాని దేహధారి అయిన ఆత్మ మాత్రము నిత్యుడు నాశము లేనివాడు, తెలియబడనివాడు. దేహినోఽస్మిన్ యధాదేహే, కౌమారం యౌవనం, జరా।తథా దేహాంతర ప్రాప్తిః ధీరస్తత్ర నముహ్యతి (2-13) జీవునకు శరీరంలో, బాల్యము, యౌవనం, వార్ధక్యం వచ్చినట్లే ఈ దేహాన్ని విడిచి ఇంకొక దేహాన్ని ధరించడం కూడా ఒక సహజమైన పరిణామదశ అని తెలుసుకొన్న ధీరునికి ఇక శోకం ఎందుకు కలుగుతుంది ?

వాసాంసి జీర్ణాని యథా విహాయ, నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణాని, అన్యాని సంయాతి నవాని దేహీ ॥ (2-22)
మానవుడు అవసరం తీరిన బట్టను విడిచి వేరు వస్త్రాలను ధరించునట్లే, జీవుడు కూడా అవసరం తీరిన దేహాలను వీడి నూతన దేహాలను ధరిస్తాడనే సత్యాన్ని గుర్తించాలి.

జాతస్య హిధ్రువో మృత్యుః, ధ్రువం జన్మ మృతస్యచ ।
తస్మాద పరిహార్యేఽర్థే, నత్వం శోచితు మర్హసి ॥ (2-27)

పుట్టిన ప్రతీ దేహానికీ మరణించడం నిశ్చయం, మరణించిన జీవి మరల జన్మించడం నిశ్చయము. తప్పని సరిగా సంభవిస్తుండే ఈ ఘటనలకు ఎవ్వరును శోకింపరాదు. తస్మాత్ అపరి హార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి అని భగవంతుడు చెప్పిన ఈ వాక్యం సదాస్మరణీయం. తప్పింప వీలుపడని వాటి గురించి శోకిస్తూ కూర్చోవడం అవివేకం, అని గుర్తుంచుకోవాలి.

**37.6. కోపం ప్రదర్శిస్తే గాని ఎవ్వరూ పనిచేయరు. అందుకే నాకు కోపం అలవాటయి పోయింది. ఇది తప్పా ?**

అవును. తన కోపమె తన శత్రువు అన్నారు. కోపముునను ఘనత కొంచమై పోవును అన్నారు. నరకానికి మూడు ద్వారాలున్నవని గీతలో చెప్పారు. ఒకటి క్రోధము. మిగిలిన రెండు కామము, లోభము. ఈ మూడూ తోడుదొంగలు. కోపావేశంలో మానవుడు దానవుడై పోతాడు.

''క్రోధాత్ భవతి సంమోహః, సంమోహాత్ స్మృతి విభ్రమః ।
స్మృతి భ్రంశాత్ బుద్ధి నాశః, బుద్ధి నాశాత్ ప్రణశ్యతి ॥ 2-63
కోపం వలన మూఢావేశము, దాని వలన మతి భ్రమ, మతి భ్రమ వలన బుద్ధి నాశము, బుద్ధినాశముతో సర్వనాశమూ సంభవిస్తాయి. అని భగవానుడు చెప్పాడు. కామఏష క్రోధ ఏష, రజోగుణ సముద్భవః, మహాశనో మహా పాప్మా, విద్ధి ఏనం ఇహ వైరిణం ॥ (3-37) ఈ కామము, క్రోధము రెండూ రజోగుణంచే పుట్టినవి. ఘోరపాపాలకు పురిగొల్పుతాయి. ఇవి, ఎంత తీర్చుతున్నా తృప్తి చెందనివి. ఇవి, మానవునకు పరమశత్రువులుగా గ్రహించి, వీటిని అణచివెయ్యాలి. కోపం వస్తున్నప్పుడు ఈ సందేశాలు మననం చేసుకోవాలి.

***37.7. సుఖాల ననుభవించడానికే పుట్టాం గనుక కోరికలుంటే తా.***

ఈ సుఖాలూ దుఃఖాలూ ఎలాంటివో, అవి ఎన్నాః తెలుసుకొంటే, సుఖాలకోసమే మానవుడు పుట్టాడు తొలగిపోతుంది. (37.4 వ ప్రశ్నకు జవాబు చూడండి.) ఈ ౹ అనుభవాలు, ఇంద్రియాలు, విషయాలపై చరించడం వలన క ఇంద్రియాలకు విషయాలతో సంపర్కం కలుగక పోతే అనుభవ సుఖాలూ దుఃఖాలూ ఒక దాని వెంట ఒకటి వస్తాయి గనుక కేవలం సు దుఃఖాలు వద్దు అనుకొంటే కుదరదు. ఈ అనుభావాలైనా ఎక్కువక కావు. వచ్చినట్టే, వెళ్లిపోతాయి. ఇంద్రియాలను అదుపులో నుంచక పో విడిగా చరించి, పతనానికి దారితీస్తాయి. '' ఇంద్రియాణి ప్రమాథీని హ మనః (2-60) కల్లోలం సృష్టించునట్టి ఈ ఇంద్రియాలు జ్ఞానుల యొక కూడ బలవంతంగా లాక్కొని పోతాయి.

*ధ్యాయతో విషయాన్ పుంసః, సంగస్తే షూపజాయతే।*

*సంగాత్ సంజాయతే కామః, కామాత్ క్రోధోఽభిజాయతే*

విషయాల గురించి ఆలోచిస్తుంటే వాటిపై ఆసక్తి కలుగుతుంది. ఆసక్తి వ పుడ్తాయి. కోరికలు తీరినా తీరకపోయినా కోపం వస్తుంది. కోపం యొక్క సర్వనాశమే అని వెనుకటి ప్రశ్నోత్తరంలో చెప్పబడింది.

''తదస్య హరతి ప్రజ్ఞాం, వాయుర్నావ మివాంభసి (2-67) చరించు ఇంద్రియాల వెంట పోతున్న మనస్సు తనతోపాటు, నావ పోవు వాయువువలె, విచక్షణా ప్రజ్ఞను అపహరించుకొని పోతుంది''. '' ఇంద్రియాణి ఆదౌ, నియమ్య భరతర్షభ।పాప్మానం ప్రజాహిహ్యేనం, నాశనం (3-41) అందుచేత, ఓ భారత శ్రేష్ఠా! పాపాలు చేయించునట్టి విజ్ఞానాలను నశింప జేసేటట్టిదియు అయిన ఈ కామం అనే శత్రుః మొదట ఇంద్రియాలను నిగ్రహించి, నశింపజేయాలి. తనివి తీరని ఆ మరణాంతం చింతలతో, వందలాది ఆశాపాశాలతో, కామభో అన్యాయంగా ధనమార్జించే వారు అసుర గుణాలు కలవారు. వారు నరకా (16-10,12,16) కామము, క్రోధము, లోభము, ఈ మూడూ జీవు తీసుకొని పోయే మూడు ద్వారాలు. (16-21). ఈ వాక్యాల వలన క వినాశకర మైనట్టివో తెలుసుకొని, వాటి వెంట మనస్సును పరుగెత్త నీయ

**37.8. ఈ భూమి మీద ఉన్న కొద్ది రోజుల్లోనే, దొరికిన దంతా అనుభవించేయాలి. తరువాత ఏం జరుగుతుందో ఏం చెప్పగలం ?**

చార్వాకులు, నాస్తికులు ఇలాగే అనుకొంటారు. చార్వాకుల సిద్ధాంతం :- '' యావజ్జీవేత్ సుఖం జీవేత్, ఋణం కృత్వా ఘృతం పిబేత్ '' బ్రతికియున్న కొద్దికాలం, సుఖంగా బ్రతకాలి, దానిగురించి అప్పుచేసి అయినా నేతినే త్రాగాలి అని చార్వాకులు నమ్ముతారు. ఇట్టివారు అసుర గుణ సంపన్నులని భగవానుడు చెప్పాడు. వారు ఎప్పుడూ నీచ జన్మలలోనే కొట్టుకొంటారు. భోగే రోగ భయం అన్నారు. భోగలాలసతో అనుభవించేవారికి రోగాలే సంభవిస్తాయి.

*యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే।*
*ఆద్యంత వంతః కౌంతేయ, నతేషు రమతే బుధాః॥* (5-22)

విషయ సంపర్కం వలన కలిగే భోగాలు, దుఃఖ క్షేత్రాలే కాకుండా, క్షణికమైనట్టివి. కావున బుధులు వాటియందు క్రీడించరు. ఆసురీ సంపదతో నున్నవారు. ఆమరణాంతం అపరిమితమైన చింతలతో ( విషయ చింతలతో కూడా) వేగుతూ కామోప భోగమే ఏకైక పరమార్థముగ నమ్మినవారై, వందలాది ఆశాపాశాలతో బంధింపబడి, కామభోగాల గురించి అన్యాయ ధనార్జన చేస్తూ అనేక చిత్త విభ్రాంతులతో జీవితాన్ని వ్యర్థ పుచ్చుతూ, నరకంలో పడుతుంటారు. (16-11,16) కాని జ్ఞానులు, ఇంద్రియ విషయాల యందు వైరాగ్యం కలిగి, జన్మ జరా, వ్యాధి, మృత్యువుల వలన కలుగ బోవు దుఃఖాల గురించి బాగుగ తెలుసుకొన్నవారై భోగలాలస యందు చిక్కుకోరు. కామోపభోగము కాకుండా జీవిత పరమావధి వేరే ఉన్నదనీ, భోగలాలస నరకానికి దారితీస్తుందనీ తెలుసుకొని దానిని దరికి రానివ్వరు. మనకు కనిపించే పుట్టుక చావుల మధ్యనున్న చరిత్రేకాకుండా జీవితం అనేక జన్మల సంస్కార కర్మఫలంతో కూడియున్నదనీ తెలుసుకొని వర్తిస్తారు.

**37.9. కావలసిన ఫలితం రావాలని ఏవేవో పనులు చేస్తుంటాం. చివరకు ఫలితం ఇంకోలాగ వస్తే ఎంతో ఆశాభంగం, నిస్పృహ కలుగుతాయి. ఏంచేయాలి?**

పని ప్రారంభించక ముందే, దాని యొక్క ఫలితం గురించి అర్రులు చాచడంలోనే ఉంది దోషం అంతా. అందుకే భగవానుడు ఇలాగ చెప్పాడు.

''కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన
మాకర్మ ఫలహేతుర్భూః, మాతే సంగోస్తు అకర్మణి ॥ (2-47)

యోగస్థ కురు కర్మాణి, సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్య సిద్ధ్యోః సమో భూత్వా, సమత్వం యోగ ఉచ్యతే ॥ (2-48)

అర్జునా! కర్మ చేసియే తీరాలి. కాని, దాని ఫలముపై ఆశతో మాత్రముకాదు. ఫలము కొరకే కర్మను ప్రారంభించరాదు. అట్లని, కర్మ చేయడం మానరాదు. సంగము విడిచి, కార్యము సిద్ధించిననూ, సిద్ధింపకున్ననూ, సమభావంతో కర్మలను ఆచరించాలి. సమబుద్ధియే యోగమన బడుతుంది''.

ఫలితం గురించి కాకపోతే, ఏ పనినైనా అసలు చేయడం ఎందుకు అనుకోరాదు. కర్మను కర్మగురించే చెయ్యాలి. కర్మ చెయ్యడం ప్రతీ వ్యక్తి యొక్క ధర్మము, హక్కు కూడాను. ప్రతీ పనినీ చేయవలసిన రీతిలో శక్తివంచన లేకుండా, నైపుణ్యంతో, పురుషప్రయత్నం అంతా చేసి, చెయ్యాలి. దానికి తోడుగా దైవకృపను కూడా అర్థించాలి. చేయబడిన ప్రతీ కర్మకూ, ఏదో ఒక ఫలం ఉత్పన్నమవు తుంది. అది మనం అనుకొన్నట్టు వచ్చినా, వేరువిధంగా వచ్చినా, దానిని భగవత్ ప్రసాదంగా సంతోషంతో స్వీకరించాలి. మనకు ప్రాప్తం ఎలాగుంటే అలాంటి ఫలమే లభిస్తుంది అనే సంపూర్ణ విశ్వాసంతో. ఇదియే కర్మచేయడంలోని నేర్పరితనం. ఈ విధంగా చేయబడిన ఏ కర్మ అయినా, అలజడులు, ఆశాభంగాలు, నిస్పృహలు కలిగించదు. ''అర్జునా! ఫలాపేక్షతో చేయబడిన కర్మ, అతిక్షుద్రమైనది. స్వల్పబుద్ధులే అలాంటి కర్మలను చేస్తారు. (2-49) అందుచేత, నీవు చేయవలసిన కర్మలను సంగరహితంగా చేస్తుంటే, పరమపదమును పొందగలవు '' అన్నాడు భగవానుడు.

**37.10. నాకు అన్నీ అనుమానాలే వస్తుంటాయి. ఎవ్వరేది చెప్పినా నమ్మలేను. ప్రవచనలు వినడానికి, గ్రంథాలు చదవడానికి ఎవరినైనా అడిగి తెలుసుకోడానికీ, నాకు శ్రద్ధలేదు..**

సరిగ్గా ఇలాంటి వ్యక్తుల గురించియే భగవానుడు చెప్పాడు :

''శ్రద్ధావాన్‌లభతే జ్ఞానం (4-39) మిక్కిలి శ్రద్ధకలవానికే జ్ఞానం లభిస్తుంది.

''అజ్ఞశ్చా శ్రద్ద ధానశ్చ, సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోஉస్తి నపరో, నసుఖం సంశయాత్మనః ॥ (4-40)

అజ్ఞాని, శ్రద్ధలేనివాడు, సంశయాత్ముడు, వినాశాన్ని పొందుతాడు. సంశయాత్మునికి ఇహలోకంగాని, పరలోకంగాని, సుఖశాంతులుగాని ఉండవు''.

అందుచేత, అజ్ఞానాన్ని బాపుకోడానికి, శ్రద్ధపెంచుకోడానికి, తెలిసిన వారినుండి, గ్రంధపఠనం ద్వారా సంశయాలను నివారించుకోడానికి నిరంతర కృషి చేసి ఉన్నతిని సాధించాలి.

**37.11. నాకు అన్నీ ఉన్నవి - ఉద్యోగం, హోదా, ధనం, ఇల్లు, భార్య, పిల్లలు. కాని నాకు అందరికంటె మీదికి ఎక్కాలనే కాంక్ష తీరకున్నది. ఎన్ని ఉన్నా నాకు మాత్రం మనశ్శాంతి కరువైంది. ఏం చేయాలి ?**

ఇవి అసుర సంపద లక్షణాలు. ఎన్ని ఉన్నా, ఇంకాఇంకా కావాలనుకొనే ప్రవృత్తిని లోభమంటారు. విషయ వస్తు సంపద పెరుగుతన్నకొద్దీ, మనశ్శాంతి దూరమవుతూ ఉంటుంది. ఆ రెండూ కలిసి ఉండలేవు.

''దంభో దర్పోఽభిమానశ్చ, క్రోధః పారుష్య మేవచ ।
అజ్ఞానం చాభిజాతస్య, పార్థ సంపద మాసురీం ॥ (16-4)

పార్థా! దంభము, దర్పము, స్వాతిశయము, అజ్ఞానము, క్రోధము, కఠినత్వము, జాతిగర్వము, అసుర సంపదలతో పుట్టిన వారికి ఉంటాయి. వారి అలోచనలు ఇలా ఉంటాయి ''ఇది ఇప్పుడు నాకు ఉన్నది. ఈ కోరిక ఇంకా తీరవలసియున్నది. ఆ ధనం ఇంకా పొందవలసియున్నది. ఈ శత్రువును (ప్రత్యర్థిని) నేను పడగొట్టాను. మిగిలిన వారిని కూడా పడగొడ్తాను. నేను కార్యాలను సాధించగల వాడను. నాకుసాటి ఎవడూలేడు. నేనే ప్రభువును'' అని ఈ విధమైన అనేక చింతలతో ఆశా పాశాలలో చిక్కుకొని, అన్యాయార్జనలుచేస్తూ, నరకలోకానికి వెళ్లే మార్గం వేసుకొంటారు''. అని భగవానుడు చెప్పాడు. (16-13,14)

'ఇది ఒక విధమైన జాడ్యం' తృష్ణ. కామమూ (కోరికలు), లోభమూ, తోడుదొంగలు. వీటిని తీర్చుతున్న కొద్దీ వృద్ధి చెందుతాయి. కామానికి విరుగుడు సంతుష్టి. లోభానికి విరుగుడు దాతృత్వము (దానశీలత). మానవుని సకల కార్యకలాపాలకు అంతిమ లక్ష్యము సుఖప్రాప్తి, దుఃఖనివృత్తి. ఇది శాంతిద్వారానే లభిస్తుంది. దానికి కొంత కృషి అవసరం. దైవీ సంపదలను పెంచుకొని, ఆసురీ సంపదలను తొలగించుకోవాలి. ఆధ్యాత్మిక చింతన చేయాలి. ''సంతుష్టికలవాడు (12-14,19) నాకు ప్రియుతముడు. ఆశ లేనివాడు, దేనినీ పరిగ్రహింపని వాడు. అప్రయత్నంగ లభించిన దానితో సంతుష్టిని జెందినవాడు వివేక వంతుడు (4-21,22) మనసులో కోరికలెన్ని ప్రవేశించినా చలించని వ్యక్తి పరమ శాంతిని

పొందుతాడు (2-70). అహంకార, మమకార, ఆశా కాంక్షలను వీడి, కోరికలన్నిటిని త్యజించి, చరించు మానవుడు పరమశాంతిని పొందుతాడు (2-71). త్యాగము చేత శాంతి లభిస్తుంది. (12-12) జ్ఞానం లభించితే పరమ శాంతి లభిస్తుంది (4-39)'' అని భగవానుడు చెప్పిన వాక్కులను మననం చేసుకోవాలి.

### *37.12. పాపం చేసే వానికి ఇక నిష్కృతియే లేదా?*

లేకేమి ? ఉన్నది. భగవానుడే అత్యంత కరుణతో హామీ ఇచ్చాడు.

''అపిచేత్ సుదురాచారో, భజతే మాం అనన్య భాక్। *(9-30)*

కౌంతేయ ప్రతిజానీహి, నమే భక్తః ప్రణశ్యతి ॥ *(9-31)*

మిక్కిలి దురాచార పరుడైనప్పటికీ, అనన్యభక్తితో నన్ను ఆరాధిస్తే అతడు సత్ పురుషుడే అయి, త్వరలోనే ధర్మాత్ముడై శాంతిని పొందుతాడు. కౌంతేయా! నా భక్తుడు ఎన్నటికీ నాశము చెందడని ప్రమాణ పూర్వకముగ చెప్పవచ్చు. పాపులందరిలోకి పాపుడైనను, జ్ఞానము ద్వారా తరించవచ్చును (4-36)'' అని చెప్పాడు. బందిపోటు రత్నాకరుడు వాల్మీకి మహర్షిగా రామనామముచే మారలేదా?

**37.13. భగవంతుని యందు భక్తి జూపడానికి భాగ్యవంతులకే సాధ్యపడుతుంది. కాని, తన భుక్తికే ఏమిలేని దరిద్రుడు దేవునికి ఏమిటి సమర్పింపగలడు ?**

ఇది చాలా తప్పుడు తలంపు. సర్వమూ సృష్టించిన సర్వేశ్వరునికి మానవ మాత్రుడు ఏమిటి ఇవ్వగలడు ? దేవునికి ఏమిటి కావాలి ? భగవానుడే ఇలా చెప్పాడు.

''పత్రం పుష్పం ఫలం తోయం, యోమే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుప హృతం, అశ్నామి ప్రయతాత్మనః ॥ (9-26)

యత్ కరోషి యదశ్నాసి, యత్ జుహోషి దదాసి యత్।
యత్ తపస్యసి కౌంతేయ, తత్ కురుష్వ మదర్పణం ॥ (9-27)

కౌంతేయా! ఎవడు భక్తి శ్రద్ధలతో పత్రాన్నిగాని, పుష్పాన్ని గాని, ఫలాన్ని గాని, జలాన్నిగాని అర్పిస్తాడో, దానిని నేను ప్రీతితో స్వీకరిస్తాను. కావున నీవు ఏది చేసినను, ఏది తినినను, ఏది హోమము చేసినను, ఎట్టి తపస్సు చేసినను, దానిని నాకు సమర్పిస్తే దాని యొక్క శుభాశుభాలు నీకు అంటవు''.

ఈ విధమైన ఆరాధనలో భక్తునకు ఏవిధమైన ఖర్చుగాని, కష్టముగాని కలుగదు. కేవలం భక్తి పూర్వకమైన నిర్మల హృదయమే చాలును.

### *37.14. గీతను చదివి, సూక్ష్మంగా, నేను చేయవలసిన సాధన ఏమిటి?*

ఆత్మకు జనన మరణాలు లేవు. నశించునది దేహమేకాని, దేహధారి అయిన ఆత్మకాదు. దేహనితోనున్న అనుబంధాన్ని ఒదిలించుకొని, ఆత్మ, పరమాత్మయందు ఏకం అవడమే మోక్షము. అదియే జీవితలక్ష్యం. దీన్ని సాధించడానికి కొన్ని సాధనలు చెయ్యాలి :-

1. ఇంద్రియాలను, మనస్సును, విషయాలపై చరించ కుండా నియంత్రించి, వాటిని ఆత్మ ధ్యానమందు లగ్నం చెయ్యాలి.
2. తన యందున్న రజోగుణ తమోగుణాలను గుర్తించి, వాటిని ప్రయత్న పూర్వకంగా తగ్గించుకొని, సత్త్వ గుణాన్ని పెంచుకోవాలి.
3. అలాగే తనలోనున్న ఆసురీ సంపదను గుర్తించి, తగ్గించుకొని, దైవీసంపదను పెంచుకోవాలి.
4. కర్తృత్వభావం లేకుండా, నిష్కామ కర్మలు చేస్తూ, కొత్త కర్మలను చేర్చు కోకుండా, జాగ్రత్తపడి, పూర్వకర్మ ఫలాలను అనుభవిస్తూ తరిగించుకోవాలి.
5. శాంతిని పొందడమే ధ్యేయం గనుక ఆ శాంతి సమత్వం ద్వారానే లభిస్తుంది. గనుగ, శీతోష్ణ సుఖ[illegible]ది ద్వంద్వ అనుభవాలపట్ల ఓరిమి, సమభావం అలవరచుకోవాలి.
6. దేనియందును సంగము పెంచుకోకుండా, వైరాగ్యాన్ని అలవరచుకోవాలి.
7. సర్వమూ పరమాత్మ మయమని, సర్వభూతాలయందు ఆపరమాత్మనే గుర్తించి, సర్వభూత హితము, దయ కలిగి యుండాలి. అద్వేష్టాది భక్తిలక్షణాలు సాధించాలి.
8. అహంకార మమకారాలే అన్ని అనర్థాలకూ మూలమని గ్రహించి, వాటిని తొలగించాలి.
9. అనన్య భక్తితో భగవానుని ఆరాధించాలి. నిరంతర ఆత్మ ధ్యానం చేస్తుండాలి.
10. కలియుగ సులభసాధ్యమైన నామసంకీర్తన సత్సంగాది సాధనలలో పాల్గొనాలి.గేయం గీతానామ సహస్రం, ధ్యేయం శ్రీపతి రూపమజస్రం, నేయం సజ్జన సంగేచిత్తం, దేయందీన జనాయచ విత్తం'' భగవద్గీతను విష్ణుసహస్ర నామాలను చదవాలి, శ్రీపతి రూపాన్ని ధ్యానిస్తుండాలి. సజ్జన సాంగత్యం చేస్తుండాలి, దీనులకు ధనసహాయం చేస్తుండాలి.

## ౩౮. భగవద్గీతా సంగ్రహం.( ఇది గీత యొక్క ఒక రేఖా చిత్రం మాత్రమే).

### *38.1.* అర్జున విషాద యోగము :-

గీత, ''నావారును, పాండవులును, కురుక్షేత్ర రణరంగంలోచేరి, ఏమిచేస్తున్నారు. సంజయా'' అనే ధృతరాష్ట్రుని ప్రశ్నతో ప్రారంభం అవుతుంది. దానికి సంజయుడు, రెండు పక్షాల సేనలను వర్ణించి, అర్జునుడు ఏవిధంగా రెండు వైపులనున్న బంధువులను, గురువులను, పెద్దలను చూచి, తీవ్రమమకారంతో విచలితుడై - నకాంక్షే విజయం కృష్ణ, నచరాజ్యం సుఖానిచ, నయోత్స్య కృష్ణా ! నాకు విజయం వద్దు రాజ్యం వద్దు సుఖం వద్దు. నేను యుద్ధం చేయను. అంటూ చతికల బడ్డాడో, వివరించి చెప్తాడు.

### *38.2.* సాంఖ్య యోగము :-

సాంఖ్యమనగా ఆత్మానాత్మ వివేచన. ఈ అధ్యాయంలో శ్రీభగవానుడు గీత యొక్క సారాన్ని చెప్పినట్టు భావించవచ్చు. ఆత్మ అనాత్మలను గూర్చి చెప్తూ, శరీరాలు నశించేటట్టివి గాని వాటియందుండు ఆత్మకు నాశములేదు. దానికి చావు పుట్టుకలు లేవు, అని చెప్పాడు. శీతోష్ణ సుఖదుఃఖాలు లాంటి ద్వంద్వ అనుభావాలు విషయాలతో ఇంద్రియాలు సంపర్కించడం వలన కలుగుతుంటాయి. అవి క్షణికాలు, వస్తూ పోతూ ఉండే స్వభావం కలవి. సుఖ దుఃఖాలయందును, లాభనష్టాల యందును, జయాపజయాల యందును, సమబుద్ధిని కలిగి కర్మలను చెయ్యాలి. నిష్కామ కర్మలను చేయాలి. ఫలాపేక్షతో చేయబడిన కర్మలు క్షుద్రములైనట్టివి. స్థితప్రజ్ఞుడు ఎట్టికోరికలూ లేకుండా, సుఖదుఃఖాలను పట్టించుకోకుండా దేనియందునూ అనురాగము, భయము, క్రోధము లేకుండా ప్రియాలపట్ల ఆసక్తిని అప్రియాలపట్ల ద్వేషాన్ని లేకుండా, ఇంద్రియాలను వశము నందుంచుకొని, మనో నిగ్రహంతో, అహంకార మమకారాలను వీడి, బుద్ధిని ఆత్మయందే లగ్నపరచి, ధ్యానమగ్నుడై యుంటాడు. అంత్యకాలమందు కూడా ఇట్టి స్థితి యందే ఉండి, మోక్షాన్ని పొందుతాడు.

### *38.3.* కర్మయోగము.

కర్మ చేయకుండా, ఏ జీవీ ఒక్క క్షణమైనా ఉండలేదు. త్రిగుణాల ప్రభావం చేత కర్మలు చేయబడుతునే ఉంటాయి, చేయబడిన ప్రతీకర్మకు ఏదో ఒకఫలం లభిస్తుంది. క్రియకు ప్రతిక్రియ ఉంటుంది. ఫలము గురించి పనిచేస్తే, ఆకర్మ ఫలాన్ని

అనుభవించక తప్పదు. ఈ బంధమే, జీవిని జనన మరణ సుడిగుండంలోనికి లాక్కుపోతుంది. బంధములు కలుగకుండా కర్మలను చేసే మార్గాన్ని ఈ కర్మయోగము చెప్తుంది.

1. చేయవలసియున్న కర్మలన్నిటిని చేస్తూ ఉండాలి. వాటి ఫలము గురించి ఆశించరాదు. అట్లని కర్మచేయడం మానరాదు. ఫలితం ప్రియమైనట్టిదైననూ కాకపోయిననూ, దానిని భగవత్ ప్రసాదంగా స్వీకరించి, అనుభవించాలి.
2. కర్మల యందు సంగము (ఆసక్తి, వ్యామోహం)ను పెంచుకోరాదు. కార్యము సిద్ధించినను సిద్ధింపకున్నను సమభావాన్ని కలిగియుండాలి.
3. చేయవలసియున్న కర్మలను ఫలాపేక్షలేకుండా చేయడాన్ని నిష్కామ కర్మాచరణ అంటారు.
4. లోకకల్యాణ కర్మలు భగవత్ ప్రీతికరమైనట్టివి. ఇవి బంధము కలిగించవు. మోక్షప్రదాలు.
5. ఫలాపేక్షతో చేయబడిన (కామ్య) కర్మలు నీచమైనవిగా గ్రహించాలి.
6. ఫలాపేక్షలేకుండా ఈశ్వరార్పణ బుద్ధితో చేయబడిన కర్మ ఒక పవిత్రమైన యజ్ఞము వంటిది. ఇదియే కర్మయోగము.

### *38.4.* జ్ఞాన యోగము :-

నిష్కామ కర్మచే శుద్ధమైన చిత్తము జ్ఞానోదయానికి సరియైన క్షేత్రము. జ్ఞానము ద్వారానే ఆత్మదర్శనం సాధ్యమౌతుంది. ఈ అధ్యాయంలో శ్రీకృష్ణ భగవానుడు తన పరమాత్మ తత్త్వాన్ని తెలియజేశాడు : ధర్మహాని కలిగి, అధర్మం పెరుగుతున్నప్పుడు సాధు సజ్జనుల బాధల నివారించడానికీ, దుర్జనులను శిక్షించడానికీ, ధర్మాన్ని మరల స్థాపించడానికీ, నేను ప్రతీ యుగంలోనూ అవతరిస్తుంటాను. నేను సమస్త ప్రాణులకు ఈశ్వరుడను, జనన మరణాలు లేనివాడను, అయిననూ, నాయొక్క మాయాశక్తిచే నన్ను నేను సృజించుకొంటాను. మానవులు నన్ను ఏ విధంగా ఆరాధిస్తుంటారో నేను వారిని ఆయావిధంగానే అనుగ్రహిస్తుంటాను. రాగము, భయము, క్రోధములను వీడి, నన్నే ధ్యానిస్తూ, జ్ఞాన తపస్సుచే పరిపూర్ణులైనవారు.నన్నే చేరుతారు కామవాంఛారహితమైన కర్మలు జ్ఞానాగ్నిచే నశిస్తాయి. కర్మఫలాసక్తిని త్యజించి, నిత్యతృప్తుడై మనోబుద్ధులను

నిగ్రహించి అహంకార మమకారాలు లేనివాడై సంగమును వీడి, సుఖదుఃఖాది ద్వంద్వాలకు అతీతుడై మాత్సర్యము లేనివాడై, లభించిన దానితో సంతుష్టుడై, సిద్ధిఅసిద్ధుల యెడల సమభావం కలవాడై, త్యాగ బుద్ధికలవాడై నిరంతర ధ్యానమగ్నుడై యుండు సాధకునికి జ్ఞానము సులభంగా కలుగుతుంది. జ్ఞానంతో సమానమైన పవిత్రం చేయునట్టిది వేరొకటిలేదు. ఇంద్రియనిగ్రహము, శ్రద్ధ కలిగి, ఆత్మధ్యానం చేయువానికి, పరమశాంతిని కలుగ జేయునట్టి జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం లేనివాడు, శ్రద్ధలేనివాడు, సంశయాత్ముడు ఇహపరలోకాల్లోనూ, శాంతిని పొందలేక నశిస్తాడు.

## *38.5.* కర్మ సన్న్యాసయోగము.

కర్మ చేయకుండడం కర్మసన్న్యాసముకాదు, కర్మయోగముచే, నిష్కామ కర్మను చేస్తూ, కర్మఫలాన్ని త్యాగం చేయడం. ఈ సాధన ధ్యాన యోగానికి దారితీస్తుంది. మనోబుద్ధులను వశపరచుకొని, ద్వంద్వభావాలను అధిగమించి రాగద్వేషాలను త్యాగము చెయ్యడమే సన్న్యాసము. ఫలాసక్తిని విడిచి, బ్రహ్మార్పణ బుద్ధితో కర్మచేయు సన్న్యాసికి సర్వమూ బ్రహ్మమయంగానే కనిపిస్తుంది. అట్టి జ్ఞానికి విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుడు, గోవు, ఏనుగు, కుక్క, కుక్క మాంసాహారి, అందరూ సమానంగానే కనిపిస్తారు. ఈ సమత్వమే బ్రహ్మజ్ఞానం పొందడానికి అత్యవసరం.

''తస్మాదసక్తః సతతం, కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ, పరమాప్నోతి పూరుషః ॥ *(3-19)*

ఎల్లప్పుడూ చేయదగిన కర్మను సంగరహితంగా చేసిన మానవుడు పరమ పదం పొందుతాడు.

## *38.6.* ఆత్మ సంయమ (ధ్యాన) యోగము.

ఇంద్రియ మనోబుద్ధులను అదుపులో నుంచి, వాటిని ధ్యానంలో నిమగ్నం చేసే విషయం ఈ అధ్యాయంలో చెప్పబడింది. ఈ ప్రయత్నంలో ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి. నిగ్రహింపబడిన మనస్సే బంధువులాగ సహాయపడుతుంది. నిగ్రహింప బడని మనస్సు శత్రువువలె నశింపజేస్తుంది. నిగ్రహింప బడిన మనస్సు గలవ్యక్తి, శీతోష్ణ సుఖదుఃఖాదులందును, మట్టిబెడ్డ రాతిముక్క, బంగారపు ముద్ద యందును శత్రు మిత్రుల యందును సమభావాన్నే కలిగి యుంటాడు. ధ్యానసాధన

ఎలాగ చెయ్యాలో వివరింపబడింది. ధ్యానం బాగా కుదరాలంటే, ఆహార నిద్రలు, కార్య కలాపాలు, వినోద విహారాలు, అన్నీ మధ్యే మార్గంలో నుండాలి. అతి సర్వత్ర వర్జయేత్. చంచలమైన మనస్సును మాటిమాటికి వెనుకకు లాగుకొచ్చి, అభ్యాస వైరాగ్యాలచే ధ్యానమగ్నంచేస్తూ ఉండాలి, ధ్యానానికి అంతరాయం కలిగిస్తుండే సంకల్పాలను కోరికలను, రానివ్వ కూడదు. సమస్త ప్రాణుల సుఖదుఃఖాలూ తనవిగా తలంచి, వాటిపట్ల, దయ కరుణ ఆర్ద్రత, సహాయత జూపాలి.

యోగాసాధనలో కొంతవరకు పురోగమించి, దేహాంతము సంభవించి, సాధన ఆగిపోయిననూ నష్టం లేదు. ముందు జన్మలో అక్కడి నుండి కొనసాగించి గమ్యాన్ని చేరవచ్చును.

## *38.7.* జ్ఞాన విజ్ఞాన యోగము.

విజ్ఞాన మనగా అనుభవ జ్ఞానము. వేలాది జనులలో ఏ ఒక్కడో మోక్షసిద్ధికై పాటు పడ్తాడు. అట్టివారిలో ఏఒక్కడో మాత్రమే, నన్ను వాస్తవముగ తెలుసు కోగలుగుతున్నాడు. నాయొక్క ప్రకృతి (మాయ), మనస్సు బుద్ధి అహంకారము పంచభూతాలూ అనబడు ఎనిమిది తత్వాలుగా విభజింపబడి యున్నది. ఇది అపరా ప్రకృతి. దీనికంటె ఉత్తమమైనది పరాప్రకృతి. ఇది నాయొక్క చైతన్యశక్తి. ఈ రెండు ప్రకృతుల సంయోగము వలననే సమస్త సృష్టి జరుగుతుంది. నాకంటె వేరుగా ఏదీలేదు. మణిమాలలోని దారం లాగ, నేను ఈ విశ్వమంతా వ్యాపించి, దానిని ధరించి యున్నాను. నన్ను నాలుగు విధాలైన సజ్జనులు ఆరాధిస్తారు. వారు ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానులు. వారిలో జ్ఞానియే నాకు ప్రియతముడు. అనేక జన్మల సంస్కార ఫలితంగా జ్ఞానవంతుడు, సర్వమూ వాసుదేవ మయమే అని తెలుసుకొని నన్ను కొలుస్తాడు. అజ్ఞానులు, తమ కోరికలకు వశులై అనేక దేవతారూపాలను ఆరాధిస్తారు. వారి కర్మఫలాలను నేనే ఆయా దేవతల ద్వారా ఇప్పిస్తాను. కాని అలాంటి కామ్య కర్మ ఫలాలు స్వల్పకాలికాలే. దేవతల నారాధించే వారు దేవతలనూ, నన్నారాధించేవారు నన్నూ పొందుతారు. జన్మ జరా మరణాల నుండి మోక్షాన్ని పొందగోరేవారు నన్నే ఆశ్రయించి, సమస్తమూ ఆ బ్రహ్మమే అని తెలుసుకొని, బ్రహ్మమును పొందుతారు.

## 38.8 అక్షర పరబ్రహ్మ యోగము.

అక్షర మనగా నాశరహితము. ఈ అధ్యాయంలో నాశరహితమైన పరబ్రహ్మము గురించి చెప్పబడింది. జన్మ రాహిత్యం గురించి బోధించేది ఆత్మ విద్య. ''అంత్యకాలంలో నన్నే ధ్యానిస్తూ దేహాన్ని విడిచేవాడు నిస్సందేహంగా నన్నే చేరుతాడు. నిశ్చలమైన మనోబుద్ధులతో ఏయే భావాలతో శరీరాన్ని విడుస్తే జీవి, ఆయాభావాలకు అనుగుణమైన రూపాన్నే పొందుతుంది. అందుచేత మనోబుద్ధులను నాకర్పించి, అన్నిపనులూ ( నీ స్వధర్మమైన యుద్ధం కూడా) చేస్తే నిస్సందేహంగా నన్నే చేరగలవు.'' అని చెప్పాడు భగవానుడు.

''అభ్యాసముచే ఇతర ధ్యాసలేకుండా, ఆ పరమాత్మను స్మరిస్తూ ఉండేవాడు, అచ్చటికే చేరగలడు. ఓం కారాన్ని ఉచ్చరిస్తూ దేహాన్ని విడిచే వాడు పరమపదాన్ని పొందుతాడు. అన్యచింత లేకుండా నిశ్చల మనస్సుతో సదాస్మరించు వానికి ఇది సులభసాధ్యం అవుతుంది. పుణ్యకార్యాలుచేసి, బ్రహ్మలోకం వరకూ వెళ్లినా పునర్జన్మ తప్పదు. గాని నన్ను పొందినవారికి పునర్జన్మ లేదు''. అన్నాడు.

బ్రహ్మయొక్క పగటివేళప్పుడు, సృష్టిస్థితులు జరిగి అతని యొక్క రాత్రి ప్రవేశించగానే అంతా లయించిపోతుంది. సమస్తమూ నశించినా, పరబ్రహ్మ నశించదు. అ పరబ్రహ్మ స్థానమే నాది. అచటికి చేరిన వారికి తిరిగివెళ్లడం ఉండదు. అచటికి అనన్య భక్తిచేతనే చేరగలరు.

## 38.9. రాజవిద్యా రాజగుహ్యా యోగము.

విద్యలలోకెల్ల ఉత్తమమైనదీ, అతి నిగూఢమైనదీ, ఈ బ్రహ్మవిద్య. జీవుని మోక్షరహస్యాన్ని తెలియ జేయునట్టిది. ''నా ఆధ్వర్యంలోనే, ప్రకృతి, సర్వచరాచర జగత్తునూ సృష్టిస్తుంది. కల్పాంతంలో సర్వమూ నాయందు లీనమయి పోతుంది. మళ్లీ కల్పాదిలో సృష్టింప బడుతుంది. ఈ జగత్తుకు నేనే తండ్రిని, తల్లిని, తాతను, కర్మ ఫలదాతను, పవిత్రమును ఓంకార ప్రణవమును, మూడువేదాలును, తెలియదగిన ఏకైక తత్వాన్నీ ప్రభువును గమ్యమును సర్వమూ భరించేవాడిని పరమనిధిని ఆశ్రయాన్నీ బీజమును శరణుపొందదగిన వాడను, సాక్షిని, స్నేహితుడను, సృష్టి స్థితి లయకారకుడను, అమృతుడను సత్ స్వరూపుడనూ సర్వమూ నేనే అయియున్నాను. మూఢులు నాయొక్క యధార్థ తత్వాన్ని తెలుసుకోలేక, వ్యర్థమైన ఆశలతోను, ప్రయోజనం లేని కర్మలతోనూ, అసుర స్వభావాలను పెంచుకొంటూ,

నశిస్తున్నారు. సజ్జనులు నన్ను సదా కీర్తిస్తూ జ్ఞాన యజ్ఞం ద్వారా నన్ను ఆరాధిస్తారు. అనన్యమైన చింతతో నన్నెవరు ఉపాసిస్తుంటారో అట్టి అంచచల భక్తులయొక్క యోగక్షేమాలను నేనే వహిస్తాను. అన్యదేవతల నారాధించే వారుకూడా వేరేమార్గంలో, నన్నే ఆరాధిస్తున్నప్పటికీ, దేవలతలను కొలిచేవారు దేవతలనూ పితృవులను కొలిచేవారు పితృవులనూ, నన్ను కొలిచేవారు నన్నునూ పొందుతారు. పవిత్రమైన హృదయంతో పరిపూర్ణమైన భక్తితో నాకు పత్రంగాని, పుష్పంగాని, ఫలంగాని, జలంగాని, ఏది అర్పించినా స్వీకరిస్తాను. కావున, అర్జునా! నీవు ఏపనిని చేసినా, దేనిని తింటున్నా దేనిని హోమం చేసినా, దేనిని దానం చేసినా, ఎటువంటి తపస్సు చేసినా దానిని నాకు సమర్పిస్తే నీవు కర్మ బంధం నుండి విముక్తుడవు అవగలవు. అతి దురాచారుడైననూ, నన్ను అనన్య భక్తితో ఆరాధిస్తే అతడు సజ్జనుడయి, శాశ్వత శాంతిని పొందుతాడు. నా భక్తుడు ఎన్నటికీ నశించడు సుమా! లింగ వర్ణ భేదాలేవీ లేకుండా, ఎవ్వరైనా నన్ను ఆశ్రయిస్తే పరమగతిని పొందుతారు. అందుచేత, నాయందే మనసు లగ్నంచేసి, నా భక్తుడవై నన్నారాధింపుము. నా శరణుజొచ్చుము. నన్నే నీవు పొందగలవు''. అని భగవానుడు చెప్పాడు.

## *38.10.* విభూతి యోగము

భగవానుని దివ్య ఐశ్వర్య వైభవాలను గూర్చి ఈ అధ్యాయంలో చెప్పబడింది. ఈ చరాచర విశ్వమంతా ఈశ్వర మయమే గనుక ప్రత్యేకించి, ఆ పరమేశ్వరుని దివ్య ఐశ్వర్యం ఇది, అది అని చెప్పనలవి కానట్టిది. ఉదాహరణగా, కొన్నింటిని మాత్రమే సూచింప బడినవి. ఇక్కడ భగవానుడు తన దివ్య విభూతుల గూర్చి తానే వివరించడం, ఒక విశేషము.

''నేను సమస్త ప్రాణుల హృదయమందు ఆసీనుడనై యున్నాను. ఈ సమస్తము యొక్క ఆది, మధ్య, అంతములును నేనే. నేను ఆదిత్యులలో విష్ణువును, ప్రకాశించువారలలో సూర్యుడను, వేదాలలో సామవేదాన్ని, పర్వతాలలో మేరువును, దేవర్షులలో నారదుడను, గజేంద్రులలో ఐరావతాన్ని, గోవులలో కామధేనువును, దైత్యులలో ప్రహ్లాదుడను, ఆయుధధారులలో రాముడను, నదులలో గంగానదిని విద్యలలో ఆధ్యాత్మ విద్యను, స్త్రీజాతి యందలి కీర్తి మేధాశక్తి, క్షమాగుణాలను, మాసములలో మార్గశీర్షమును, పాండవులలో అర్జునుడను, మునులలో వ్యాసుడను. ఇది అది అననేల కాంతివంతము ఐశ్వర్య యుక్తము, శక్తివంతము అయినట్టివి ఏవేవి

ఉన్నవో అవి అన్నీ నాలోని ఒక అంశము యొక్క ప్రకాశమే. సర్వజీవుల యందు ప్రకాశించుచుండే నానావిధ గుణాలు నావలననే కలుగుతున్నవి. సప్తమహర్షులు, నలుగురు సనాతనులు, మనువులు, నామానసంనుండి ఉద్భవించారు. వారి నుండి ఈ లోక సంతతులన్నీ కలిగినవి. జ్ఞానులు, నాదివ్య విభూతులను తెలిసికొన్నవారై, తమ మనస్సులను, ప్రాణాలను నాయందే ఉంచి పరస్పరం బోధించుకొంటూ, నన్ను గురించి ఎల్లప్పుడూ, ముచ్చటించుకొంటూ సంతృప్తిని ఆనందాన్నీ పొందుతుంటారు.

## *38.11.* విశ్వరూప సందర్శన యోగము.

ఇంతవరకు, భగవానుని దివ్యగుణ వైభవాల గురించి వినియున్న అర్జునునకు ఆ పరమేశ్వరుని యొక్క దివ్య దర్శనం ఎలాగుంటుందో చూడాలని కోరిక కలిగింది. భగవానుడు అమితమైన ప్రేమ వాత్సల్యంతో భక్తుని కోరిక తీర్చదలచి, అతనికి, దివ్య దృష్టినిచ్చి తన విశ్వరూపాన్ని జూపాడు. అతి అద్భుతమైన ఆ అనంత విశ్వరూపాన్ని జూచిన అర్జునుడు, సంభ్రమముతో ఆనందాతిశయంతో ఇలా పలికాడు

'' ఓ దేవ దేవా ! జగత్ పతే! ఆది మధ్య అంతములు కనిపించని అనంతరూపా! సూర్యుని వలె ప్రజ్వలించు ప్రకాశముతో నున్న నిన్ను చూడ శక్యము కాకున్నది. నీవు ఆదిదేవుడవు. సనాతన పురుషుడవు, విశ్వమంతటికి ఆధారభూతుడవు. అనంత శక్తి సంపన్నుడవు. ఆకాశమంతయూ దిక్కులన్నిటా వ్యాపించి నిండి యున్నావు.

నీ యందు బ్రహ్మదేవునితో సహా సమస్త దేవతలనూ, ఋషులను, సకల చరాచర భూతసమూహాలనూ చూస్తున్నాను. దేవతలు, మహర్షులు, సిద్ధులు గుంపులుగా చేరి నిన్ను స్తుతిస్తున్నారు. లోక కల్యాణ మగుగాక అని స్వస్తి వాక్యాలు పలుకుతున్నారు. నేను నీ దివ్య తేజోరూపాన్ని చూడలేకుంటున్నాను. ప్రభో! నీకు నమస్కారములు, అనేక వేల నమస్కారములు, ప్రసన్నుడవు కమ్ము !'' అని ప్రార్థించిన అర్జునునిపై కరుణించిన భగవానుడు ఇలా అన్నాడు :

''అర్జునా! నీ విప్పుడు గాంచిన నా యొక్క ఈ అద్భుత రూపము అతి దుర్లభమైనది. దేవతలు కూడ దీనిని నిత్యం దర్శించడానికి కాంక్షిస్తుంటారు గాని, దీనిని వేదాధ్యయనం చేగాని తపోదానాలచేగాని గాంచలేరు. నాయందు అనన్య భక్తిచే మాత్రమే, దీనిని చూడడానికి నన్ను తెలుసుకోడానికి నాయందు ప్రవేశించడానికి సాధ్యపడుతుంది'' అని చెప్పాడు.

### 38.12. భక్తి యోగము :-

ఈ అధ్యాయము గీతకు శిరోభూషణం అనవచ్చును. ఇందులో నిజమైన భక్తుని లక్షణాలు చెప్పి, తనకు ఎటువంటి భక్తులు ప్రియతములో భగవానుడు చెప్పాడు. భగవంతుని యందు అత్యంత ప్రేమను కలిగియుండడం భక్తి అనబడుతుంది. అలాంటి భక్తి అనన్యంగా నుండాలి. ఉత్తమ భక్తుడు ఇంద్రియ నిగ్రహము సమబుద్ధి సర్వభూత హితాభిలాష కలిగియుండాలి. ఏ ప్రాణినీ ద్వేషింపక, అన్ని జీవులపట్ల మైత్రి కరుణ కలిగియుండి, అహంకార మమకారాలను వీడి ఓర్పు సంతుష్టి నిశ్చల చిత్తము, శీతోష్ణ సుఖదుఃఖ, మానావమాన శుభా శుభ శత్రుమిత్రాదుల యందు సమబుద్ధిని కలిగియుండి, కర్తృత్వభావమూ, కోరికలూ, స్థిర నివాసమందు సంగమూ, లేకుండా ఉండి, శుచి శుద్ధి శ్రద్ధ కార్యదక్షత కలిగి మనోబుద్ధులను నాకు అర్పించి యుండు భక్తుడు నాకు మిక్కిలి ఇష్టుడు- అని భగవానుడు చెప్పాడు.

### 38.13. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము :-

క్షేత్ర మంటే - ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు, మనస్సు బుద్ధి అహంకారములతో కూడియున్న శరీరము. క్షేత్రజ్ఞుడంటే క్షేత్రమందుండు జీవుడు. అన్ని క్షేత్రాలలోనూ ఉండే క్షేత్రజ్ఞుడను నేనే అని చెప్పాడు భగవానుడు. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల మధ్యనుండు యధార్థ సంబంధం తెలుసుకోవడం, జ్ఞానమంటారు. అట్టి జ్ఞానాన్ని కలిగియున్న జ్ఞాని యొక్క లక్షణాలు ఇలాగ చెప్పబడినవి :

తన్ను తాను పొగడు కొనకుండుట, దంభము లేకుండుట . అహింసను పాటించుట ఓర్పు, ఋజుత్వము, గురుసేవా తత్పరత, శుచిత్వము, స్థిరబుద్ధి, ఆత్మనిగ్రహం, ఇంద్రియ విషయాలపై వైరాగ్యము, కలిగియుండుట, అహంకారం లేకుండుట, జనన మరణ వార్ధక్య వ్యాధుల వలన కలిగే దుఃఖం గురించి బాగుగ తెలిసి కొనియుండుట, విషయ వస్తువులందు ఆసక్తి లేకుండట, భార్యా గృహ సంతానాదుల యందు వ్యామోహ బంధాలలో చిక్కుకొన కుండుట, ఇష్టా నిష్టాల పట్ల సమత్వంకలిగి యుండుట, జనసమూహాల మధ్యనుండటానికి ఇష్ట పడకుండుట, ఏకాంత స్థలాన్ని ఆశ్రయించుట, ఆధ్యాత్మజ్ఞానం కలిగియుండుట, తత్త్వజ్ఞానం యొక్క ధ్యేయాన్ని గ్రహించడం, నాయందు అనన్యమైన భక్తిని కలిగియుండటం, ఇవి అన్నీ జ్ఞాన లక్షణాలు, వీటికి ఇతరములైన వన్నీ అజ్ఞానమే అని తెలుసుకోవాలి.

అజ్ఞానం వలన క్షేత్రజ్ఞు తన ఆత్మతత్త్వాన్ని విస్మరించి, క్షేత్రమే తాను అనే భ్రమలోపడి, సంసార బాధలకు లోనౌతున్నాడు. ఉత్తమ నీచ జన్మలను పొందుతున్నాడు. యదార్థముగ, ఆత్మ శరీరానికి భిన్నంగాను, సాక్షిభూతంగాను, ప్రభువుగాను, భరించువానిగను వెలసి యున్నవాడు.

## *38.14.* గుణత్రయ విభాగ యోగము.

ఒకే జాతికి చెందిన ఏ రెండు జీవులును ఒకేరీతిగ నుండవు. అలాగే ఒకే తలిదండ్రులకు పుట్టిన కవల పిల్లలు కూడా, ఒకే రూపంలో నున్నా గుణ స్వభావాల్లో మాత్రం భిన్నంగా నుంటారు. దీనికి కారణం విభిన్న అనుపాతాల్లో వాళ్లయందు నిక్షిప్తమైయున్న సత్త్వ రజస్తమోగుణాలే. ఈ త్రిగుణాల ప్రభావం వలననే సకల జీవరాశులూ విభిన్నంగా ప్రవర్తిస్తుంటాయి. ఈ త్రిగుణాలు ప్రకృతితో పాటు ఉద్భవించి, క్షేత్రజ్ఞుణ్ణి క్షేత్రంతో బంధించి ఉంచుతాయి.

బ్రహ్మాండమంతటినీ ఉత్పత్తిచేసే యోని, నాయందే ఉన్నది. దాని యందు నేనే బీజాన్ని ఉంచుతాను. అటనుండీ సర్వభూతాల యొక్క ఉత్పత్తి సంభవిస్తుంది. సత్త్వ గుణము నిర్మలమైనట్టిది. ప్రకాశింపజేయునట్టిది. ఇది జీవునికి సుఖం యందు ఆసక్తిని, జ్ఞానమునందు అనురక్తిని, కలిగించి, బంధిస్తుంది. రజోగుణము ఇంద్రియవిషయాలపై ఆసక్తి అనురాగము తృష్ణ కలుగజేసి, జీవిని నిరంతర కార్యకలాపాల్లో బంధించి ఉంచుతుంది. తమోగుణం అజ్ఞానం వలన కలుగుతుంది. ఇది భ్రమను కలిగించి, మరుపు, సోమరితనం నిద్రమత్తులందు బంధించి ఉంచుతుంది. సత్త్వగుణం వలన జ్ఞానము, రజోగుణం వలన లోభము, తమోగుణం వలన మూఢత్వము అజాగ్రత, నిర్లక్ష్యత, అజ్ఞానము కలుగుతాయి.. సత్త్వగుణాధిక్యతలో నున్నప్పుడు దేహాన్ని వీడువారు ఊర్ధ్వలోకాలకూ, తమోగుణాధిక్యతలో నుండగా దేహాన్ని వీడిన వారు అధోలోకాలకు వెళ్తారు. రజోగుణాధిక్యతలో నున్నప్పుడు మరణించువారు, మరల మర్త్యలోకంలోనే జన్మిస్తారు.

దేనినీ ద్వేషించక, కాంక్షించక, చలించక, సమత్వముతో, నిర్మల మనస్కుడైన ధీరుడు గుణాతీతుడై అమృతత్వాన్ని పొందుతాడు. నన్ను అచంచల భక్తి విశ్వాసాలతో ఆరాధించువాడు గుణాతీతుడై బ్రహ్మపదాన్ని పొందడానికి అర్హుడౌతాడు.

